క్షితి వడఁకెన్ మనంబునఁ జలించిరి పన్నగలోకవాసు లు
న్నతరుచిఁ బాసి మాసె దిననాథుఁడు మందటిలెన్ సమీరుఁడున్.

చ. వడి నమరేంద్రముక్త మగువజ్రములీల యుగాంతకాలుకై
వడిఁ బఱతెంచి రావణుని వక్షము గాఁడి ధరిత్రిఁ దూఱెఁ బ
ల్విడి దశకంఠుఁ ద్రుంచె రఘువీరుఁడు నేఁ డని మేలువార్త యే
ర్పడ ఫణిలోకవాసు లలరన్ వివరింపఁగ నేఁగెనో యనన్.

శా. ఆపుణ్యవ్రతుఁ బట్టినప్పుడె తదీయంబై యనిర్వార్య మా
కోపాగ్నిన్ మసి గాక నీ వునికి రక్షోనాథ లోకంబునన్
బాపాత్ముం డగువాఁడు పాపఫలమున్ బ్రాప్తవ్యకాలంబునన్
బ్రాపించెన్ నిజపాపకర్మఫల మిబ్భంగిన్ నినుం జెందుటన్.

చ. సవిత్రుఁడు చంద్రుఁడున్ దిశలు సంధ్యలు రేలుఁ బగళ్లుఁ గాలమున్
భువియును నాదిగా సకలమున్ గనుసాక్షులు వీ రెఱుంగ నేఁ
బ్రవిమలసద్గుణోత్తరధురాపరిభూషిత నైతి నేని హ
వ్యవహుఁడు నన్ను నిప్పుడు దయాయతచిత్తతఁ బ్రోచుఁ గావుతన్.

శా. ఆరీతిన్ భువనత్రయిన్ గలుగువా రత్యంతశోకార్తులై
ధీరత్వంబు పరిత్యజించి యలధాత్రీనందనం జెందుదు
ర్వారాపన్నత యెంచుచున్ బలుకఁ దద్వాక్యంబు లాలించుచున్
ధారాళాశ్రులతో మనం బెరియఁ జింతన్ రాముఁ డున్నత్తఱిన్.

చ. ఖలునిఁ గబంధునిన్ నిశితకాండములన్ దునుమాడి వాని ప
ల్కులు విని ఋశ్యమూకమునకున్ జని భానుజుఁ గూడి వాలి ను
జ్జ్వలబలుఁ గూల్చి యర్కసుతు వానరరాజ్యమునందు నుంచి య
య్యలఘుఁడు పంపె భూమితనయన్ వెదకన్ గపివీరకోటులన్.

చ. నిరుపమమూర్తి రామధరణీపతి శోభనవేళ నాడి ర
చ్చరపువుఁబోండ్లు కిన్నరులు సారెకుఁ బాడిరి దేవదుందుభుల్
మొరసెను ధాత్రి సస్యములు మోహనలీల వహించె వృక్షముల్
వరసురభిప్రసూనఫలవర్గములన్ విలసిల్లె నెంతయున్.

చ. అని కొనియాడుచున్ జలరుహాక్షులు సేసలు మీఁదఁ జల్లఁగా
ననఘచరిత్ర ! రామ ! సుగుణాకర ! వర్ధిలు మంచుఁ బౌరు లె
ల్లను దనచుట్టుఁ గొల్వఁగ నలంకృత మైనరథంబుపై ముదం
బున భరతాగ్రజుండు రఘుపుంగవుఁ డీగతి వైభవంబులన్.

చ. జలనిధి గట్టి మించుకపిసైన్యముతో వనరాశి దాఁటి దో
ర్బలమున లంకపై విడిసి రావణముఖ్యనిశాటకోటులన్
గలన జయించి భూతనయఁ గ్రమ్మఱఁ గైకొని నిత్యకీర్తులన్
వెలసినవాఁడు రాముఁ డిటు వింటిమె కంటిమె యిట్టి చిత్రముల్.

శా. భేరీకాహళశంఖతూర్యములు గంభీరంబులై మ్రోయఁగా
దారామార్గమునందు దేవఋషిగంధర్వస్తుతుల్ మీఱ నే
వారూఢిం దగ వందిమాగధులు కైవారంబు గావించుచున్
సారోదారవిచిత్రవైఖరుల నానందంబు గల్పింపఁగన్.

ఉ. రావణుఁ గూల్చి క్రమ్మఱ ధరాసుతఁ జేకొని వచ్చుచున్నవాఁ
డావసుధాకళత్రుఁ డిదె యాప్తులతోడ మహేంద్రుతో శచీ
దేవియుఁ బోలె సీత జగతీతలనాథునిఁ గూడి సంతత
శ్రీ విలసిల్లనున్నయది చేరివవాఁడు సుమిత్రపట్టియున్.

చ. అలికులవేణులన్ జలరుహాక్షులఁ జంద్రనిభాస్యలన్ విని
ర్మలమణిహారభూషణసమగ్రల భార్యలఁ గా వరింపు గ
న్యల గుణజాతియుక్తలఁ బదార్గుర గ్రామశతంబుఁ జూడఁ జె
న్నలరెడులక్షగోవులఁ బ్రియం బెలఁగించిన నీకు నిచ్చెదన్.

ఉ. కొంచక కోటపై నిలిచి కొందఱు భీమబలాఢ్యులైనన
క్తంచరు లుగ్రతోమరగదాపటుశక్తుల వానరాలి మె
ప్పించిరి వానరేంద్రులును జేర్చి రణంబునఁ గోటపైకి లం
ఘించి నిశాటులన్ ధరణికిం బడ నీడిచి వొంచి రుద్ధతిన్.

మ. నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటీవధూటీఘటీ
ఘనకోటీశకటీకటీతటిపటీగంధేభవాటీపటీ
రనటీహారిపటీసువర్ణమకుటీప్రచ్ఛోటికాపేటికల్
కనదామ్నాయమహాతురంగ! శివలింగా! నీలకంఠేశ్వరా!

* * * * *

చదలువాడ ఎఱ్ఱాప్రెగ్గడ రచనముతో నీ కవిస్తుతిపద్య మొక ప్రాచీన పద్యసంకలమునఁ గానవచ్చినది.

శా. సారోదారసమంచితస్ఫురదురుస్ఫాయల్లసల్లాలిత
(స్ఫారంబుల్ వె ?) సఁ ద్రిప్పి పెట్టుచును శబ్దద్రవ్యహీనుల్ సదా
తారుం జెప్పితి మంచుఁ జెప్పికొనుటల్ తప్పే నిరాఘాటవా
క్సౌరభ్యప్రతిభావిజృంభితులు మెచ్చర్ గాక యానందముల్.

ఇది ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణకృత్యవతరణికలోనిది గావలెను.

* * * * *

ఈ క్రిందిపద్యమును 'ఎఱ్ఱన రామాయణములోనిదా ?' అని యెప్పుడో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ నోటుబుక్కులో వ్రాసికొని రఁట!

ఉ. చువ్వన మేను వంచి రవి సోఁకఁగఁ దోఁక విదల్చి పాదముల్
వివ్వఁగఁ బట్టి బాహువులు వీచి మొగంబు బిగించి కొండ జొ
జవ్వన నూఁగి ముందఱికిఁ జాఁగి పిఱిందికిఁ దూఁగి వార్థిపై
ఱివ్వన దాఁటె వాయుజుఁడు ఱెక్కలతోడిసురాద్రియో యనన్.

* * * * * * * *

కూచిమంచి తిమ్మకవి గాక మఱికొందఱు లాక్షణికులును ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోని పద్యములను తమ లక్షణగ్రంథములం దుదాహరించినారు. అట్టివి మఱికొన్ని యీ క్రిందివి.

గణపవరపు వేంకటకవి ప్రయోగరత్నాకరము:

తే. ధాత్రీసురసేవారతి, భ్రాతృభృతిగురూక్తిపాలబంధురమతి దు
ర్జాత్రవహారణచణస్థితి, మిత్రానందకరవిఖ్యాతి మాయం దమరున్.

సీ. బాలసుధాంశునిటాలుని నవసుధా,లాపముల్ వినవలె ననెడునాస.

క. ఆ దశరథసూనుండు ప,యోధిజలం బింక నేసి యొకశరమునఁ గ్ర
వ్యాదవిభుఁ దునిమి సీతను, మోదంబునఁ జేకొని కపిపుంగవుతోడన్.

—ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణము.

* * * * *

వావిళ్లవారి ముద్రణమున భాస్కరరామాయణము యుద్ధకాండము లోని యీ క్రిందిపద్యము 'ఎఱ్ఱాప్రెగ్గడవారి పద్య మని ప్రతీతి' అను అధోజ్ఞాపికతో కానవచ్చును.

ఉ. త్రెవ్వెడుగంటులం గురుపు దేఱెడునెత్తురు రాక మున్న యే
నొవ్వియు నేవికారము మనోగతిఁ జెందక మున్న సాయకం
బవ్వలఁ బోక మున్న మకుటాట్టవిఘట్టనరావ మొప్పఁగా
నువ్వున నుప్పతిల్లె ససురోద్వహమూర్ధచయంబు గ్రక్కునన్. —ప. ౧౧౫౮.

* * * * *

ఆనెగొందిలో దొరకిన యొక భాస్కరరామాయణపుఁ దాళపత్త్రప్రతిలో నారణ్యకాండమున ఎఱ్ఱాప్రెగడకృతములుగాఁ గొన్నిపద్యములు కానవచ్చిన వని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు గుర్తించి తెలిపిరి.

ఉ. ఆనెఱజోదు కేలు దొనకై నిగుడించుట, యమ్ము మౌర్వీసం
ధానము సేత, నిండఁ దెగఁ దార్కొని లక్ష్యము సేయు, డేయుదుర్
గాన నజస్రమండలితకార్ముక మొక్కటి గంటిఁ గంటి న
ద్దానవదీర్ఘదేహసముదాయనిరంతరపాతవేగముల్.

స్రగ్ధర. కరిణీయానంబు నవ్వీక్ గతి, నవలతికాకార మంగంబు, చంద్రుక్
బురుణించుక్ ముద్దుమో, మంబురుహదళములం బోలుఁ గన్నుఁ, ల్విపంచీ
స్వరసంకాశంబు పల్కుక్, జలదలినిచయస్పర్ధి గైు యుండు వేణీ
భర, మాతన్వంగి కింద్రప్రముఖనిఖిలదిక్పాలకాభీలశౌర్యా!

చ. అలినిభవేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్ర కో
మలలతికాభిరామభుజ మంజులవృత్తలసత్కుచద్వయీా
కలితసుమధ్య హృద్యకటి కామ్యతరోరువు రమ్యజంఘ యు
జ్జ్వలచరణాబ్జ తద్వనిత జానకి నా విలసిల్లు రావణా!

శ్రీరస్తు

# హరివంశము

## పూర్వభాగము - ప్రథమాశ్వాసము



కిం బ్రేమపదంబు భూమికి నతిస్నిగ్ధుండు దుగ్ధాబ్ధిశ
య్యాకేళీరతుఁ డాదివేధకు గృహం బై యొప్పునాభిస్థనా
ళీకంబుం గలవేల్పు లోకములఁ బాలింపం బ్రభుం డుత్తమ
శ్లోకుం డన్నమవేమభూవిభున కిచ్చుఁగా సుస్థిరైశ్వర్యముల్. 1

శా. శర్వాణీస్తనచక్రవాకములు సత్కస్నాఖరకాసారముం
గర్వం బింపెసలారఁగాఁ బఱిసి వేడ్కల్సల్ప రోమాంచముం
సర్వాంగీణముగాఁ ధరించి[1]కొని యిచ్చుం బేర్చు శంభుండు స
ర్వోర్వీరక్షణదక్షు వేమనృపు [2]నత్యూర్జస్వలుం జేయుతన్. 2

ఉ. తమ్మికిఁ జూలు లోకములతాత తపస్వులయొజ్జ యోఁగివ
ర్గమ్ముల కాద్యుఁ డాగమపరంపరకుం బ్రభవంబు ధర్మభా
గమ్ములకర్త భారతికిఁ గాదిలి మువ్వురతొల్తపేరు ని
[3]త్యమ్ముగ నాయువీవుత [4]గుణాఢ్యుఁడు ప్రోలయవేమశౌరికిన్. 3

మ. కమలాక్షుస్మరఘస్మరాబ్జభవులుం గైవారు లంభోధిపూ
రములుం బుక్కిటిసామి గోత్రగిరిసర్గంబుం గనత్కందుకా
భము సంక్రీడనవేళ నేవిభున కాభవ్యుండు ప్రత్యూహసం
తమసాదిత్యుఁ డిభాననుం డొసఁగు భద్రంబుం గృతిస్వామికిన్. 4

మ. వరసత్త్వప్రతిపత్తిధుర్య మగునైశ్వర్యంబు పంచాశద
క్షరసంసిద్ధసమస్తశబ్దరచనాసంవ్యాప్తి సుద్ధీష్టమై
పరఁగం గల్పలతాసధర్మ యగుచుం బ్రజ్ఞావిశేషాఢ్యులం
గరుణం బ్రోచు సవిత్రి వాణిఁ ద్రిజగత్కల్యాణిఁ బ్రార్థించెదన్. 5

శా. సందీప్తార్కసమప్రకాశు జలదశ్యామాంగుఁ గ్లప్తాఖిల
చ్ఛందోబృందవిభాగుఁ బావనయశస్సందోహు [5]అస్పందధీ

---

1. లలితేచ్ఛం బొల్చు శంభుం డశేషోర్వీరక్షణదక్షు వేమనృపు. 2. నితోర్జస్వలున్ జేయుతన్. 3. మ్మగు. 4. కళాఢ్యుఁడు. 5. అస్పంద స, త్సందిష్టాంచిత.

సంపత్ప్రాంచితు భారతాగమకథాసద్భావు లోకత్రయా
నందప్రాప్తికరుం బరాశరసుతు౯ సర్వజ్ఞుఁ గీర్తించెదన్. 6

మ. చతురోద్యన్మతి వాతపోతకమహాసాంయాత్రికుండై తగ౯
జతురామ్నాయపయోధుల న్వెలఁగి భాస్వద్రత్నముల్ రామస
న్నుతిరూపంబుగఁ గూర్చి విశ్వజగము౯ భూషించె నేధన్యుఁ డా
ప్రతిముఖ్యుండు ప్రసన్నుఁ డయ్యెడుఁ గృప౯ వాల్మీకి మాకెప్పుడున్. 7

ఉ. ఉన్నతగోత్రసంభవము నూర్జితసత్త్వము భద్రజాతిసం
పన్నము నుద్ధతాన్యపరిభావిమదోత్కటము న్నరేంద్రపూ
జోన్నయనోచితంబు నయి యొప్పెడు నన్నయభట్టకుంజరం
బెన్ననిరంకుశోక్తిగతి నెందును గ్రాలుట ప్రస్తుతించెదన్. 8

మ. తనకావించిన సృష్టి తక్కొరులచేతం గాదు నా[1] నేముఖం
బున డాఁ బల్కినపల్కు లాగమములై పొల్పొందు నా [2]వాణి భ
ర్తను (?) నీతం డొకరుండ నాఁ జనుమహత్త్వాప్తి౯ గవిబ్రహ్మ నా
వినుతింతు౯ గవితిక్కయజ్వ నఖిలోర్వీదేవతాభ్యర్చితున్. 9

ఉ. కామవిలోభకస్పృహల గర్వపరంపర [3]క్రందువాసి హృ
త్తామరసస్థితుం డగు సదాశివుఁ గాంచి తదేకచింత చిం
తామణియై తలిర్పఁ దుదిదాఁకినయున్నతిఁ గన్న శంకర
స్వామి గురుండు మాతలఁపు సర్వముఁ దానయి యుండుఁగావుతన్. 10

వ. అని యిట్లు పూజ్యపూజాతత్పరుండనైన నాకు నభీష్టార్థదాత లై యవదాత చరితంబున నఖిలజనరంజనం బొనర్చుటం జేసి రాజశబ్దంబునకు భాజనం బగుచుఁ దేజోవిలాసైకనిత్యుండు పల్లవాదిత్యుం డనియును నుద్ధాత్తపౌరుషోద్ధతుండు జగనొబ్బగండం డనియును సంగతానేకనరపాలనపరిపాలనశీలుం డంగరక్షా పాలుం డనియును [4]సకలకళాధికృత విస్మయకేళీవిధేయుండు కేళాధిరాయం డనియును వసుభూతోద్భుతసమరవిజయుండు సంగ్రామధనంజయుం డని యును [5]అఖిలశత్రువిదారణప్రతిజ్ఞాపూరణోద్దాముండు భుజబలభీముం డని యును నసాధ్యసాధకవీరవ్రతనిర్వహణపరాయణుండు వీరనారాయణుం డని యును దురవగాహరిపువ్యూహావ్యపోహాభీలుండు గుజ్జరిదళవి[6]పాలుండనియు నాశ్రితరక్షణవ్యవసితదయాలోలుండు [7]జగరక్షపాలుం డనియును [8]జతుర్విధ దుర్గదారణవిహారోదారుండు చంచుమలచూఱకారుం డనియును బ్రతిభటవే దండఖండనప్రచండుండు మండలీకరగండం డనియును బహుప్రకారంబుల వీర

1. నాముఖంబున. 2. వాణినత్తను. 3. పొందు. 4. సకలకథావిశ్రుత. 5. దుశ్శీలశత్రు. 6. విభాలు..., 7. జగద్రక్షపాలుండు 8. చతుర్విధదుర్గ విదళనోదారుండు.

వ్యవహారంబులవలన నిశ్శంకంబులై బిరుదాంకంబులు ప్రవర్తిల్ల విలసిల్లు వేమ
జనేశ్వరుండు. 11

క. [1]సకలకవివర్ణనీయుఁడు, సకలనృపతిపూజ్యుఁ డతని[2]సంపద్వైభవం
బకలంక మనాతంకము, సకలజగన్మంగళప్రసంగము [3]పేర్మిన్. 12

సీ. కేయూరకంకణాంకితపరాక్రమసితరణములు [4]బాహాభూషణత నొంద
ననుకూలగృహిణిచాడ్పున నృపశ్రీ యెందుఁ గదలక సకలసౌఖ్యముల నొసఁగ
నమృతసేవనము చందమున [5]నుత్తమధర్మతాత్పర్య మధికమోదంబుఁ బెనుపఁ
గరతలామలకవిఖ్యాతి నాతతనీతిగరిమంబు నిజవివేకమున వెలయ

తే. జాహ్నవీప్రవాహముభంగిఁ జరితమఖిల, భువనపావనపరిపూర్తిఁ బొలుపుమిగులఁ
బరఁగు వేమక్ష్మానాథుపాటినృపులు, గలరె యెవ్వారు ధారుణీతలమునందు. 13

ఉ. వాలి మదోద్ధతారిజయవాంఛ నుదగ్రభుజుండు వేమభూ
పాలుఁ డనంతసైన్యభయబంధురలీలఁ గణంగి యెద్దెసన్
గ్రాలఁగఁ దీవ్రఘోట[6]ఖురఘట్టన మొందనిచోటు లేదు వా
చాల [7]విలోలవీచిశతసంకులసాగరవేష్టితక్షితిన్. 14

శా. కాంతారంబులు దాఁటి శైలములు ప్రాకన్ బాటి [8]యంభోధితో
యాంతర్యాభ్రముల దాఁటి యెన్నఁడు[9]ను భీత్యంతం బెదం గాన క
త్యంతక్లేశము నొందుచుండుదురు వేమాధీశుధాటిం బరి
భ్రాంతిత్యక్తకళత్రపుత్రసుహృదాప్తశ్రీకులై శాత్రవుల్. 15

మ. గజతాఘోటకహాటకప్రముఖముల్ గప్పంబు లొప్పించుచున్
విజితారాతులు మ్రగ్గ దిక్కుల హిమానీకాశ [10]నీకాశలై
నిజకీర్తుల్ నిగుడంగ లక్ష్మి కతులోన్మేషంబు పోషించె న
క్కజమై వేమనరేంద్రుపేర్మి జగదాకల్పంబు గా కల్పమే. 16

క. ఘనుఁడు పరాక్రమసంభృత, ధనకోటికి ఫలము పాత్రదానమ యని యెం
డును బహుపురాణముఖముల, వినుచుండుటఁ జేసి యధికవిశ్వాసమునన్. 17

వ. ఇష్టాపూర్తరూపం బగు క్రియాకలాపంబు నిజకర్తవ్యానురూపంబుగాఁ దొడంగి.

సీ. అగ్రహారములు విద్యాతపోవృద్ధవిప్రుల కిచ్చి యజ్ఞ[11]కర్తలుగఁ బనిచెఁ
గోమరాఁ జెఱువులు గుళ్లు ప్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులు నల్లిండ్లను నిలిపెఁ దోఁటలు సత్రములు [12]చలిపందిళ్లు వెలయఁ బెట్టె
హేమాద్రిపరికీర్తితామితవ్రతదాననివహంబు లన్నియు నిర్వహించెఁ

1. సకలవిధ వర్ణనీయుఁడు. 2. సద్గుణనివహం. 3. కృతి. 4. బహుళ. 5. ననుత్తము. 6. ఖుర ఖండన. 7. విశాలవీచికరజాలమునకు కూలల; విశాలవీచికర సంకుల: 8. అంభోధిజాతయాంతర్యాభ్రములు. 9. నిరత్యబ్ధింజెడం. 10. రాకేశు. 11. భర్తలుగ పనిచె. 12. చలివిందరల్.

తే. జేసెఁ జేయుచునున్నాఁడు సేయుచున్న, వాఁడు పురుషత్రికృతిశుభావళుల నెల్ల
[1]ననఁగ శ్రీవేమవిభునకు నలరుపేర్మి, నశమె వర్ణింపఁ దద్భాగ్యవైభవంబు. 19

ఉ. చుట్టు నిజప్రభాపరిధిసోఁకున సర్వనివేలుశైలముల్
గట్టిగఁ జెందియుండు తనకుఁ గాంచనభూధ్రములొప్పఁ బొత్రమై
[2]చుట్టము లెల్ల నాత్మసముశోభితసంపదనొంద నొప్పఁ దాఁ
జుట్టపుమేరువన్నిసుతి సొంపున వేమనరేంద్రుఁ డున్నతిన్. 20

చ. కులజలరాశిచంద్రుఁ డగుకోమటిప్రోలనయు న్నితంబినీ
తిలకము పుణ్యరాలు పతిసేవత యన్నమయుం గృతార్థతా
కలితులు [3]వీరు వేమవిభుఁ గానఁగఁ గాంచిరి [4]పుణ్యపుట్టి పెం
పొలఁతుల నెన్నిజన్మములఁ గూర్చిరో నాఁ [5]బొదలెన్ జనస్తుతుల్. 21

సీ. పంట[6]కులస్వామి ప్రఖ్యాతుఁ డౌర వేమయపితామహుఁ డనుపమాన్యతయును
ధూతకలంకుండు దొడ్డయ సైన్యనాయకుఁడు మాతామహుం డనువినుతియు
నాదిరాజన్యతుల్యాచారనిధి మాచవిభుఁడు పూర్వజుఁ డను విశ్రుతియును
శ్రీయుతుల్ [7]పోతయ చిట్టయ నాగయ ప్రభులు మాతులు రను భవ్యతయును
తే. దనమహత్త్వంబు భూషింపఁ దాను వారి, పేరు వెలయింపఁ జాలుగంభీరమహిమ
నాత్మగుణముల నొదవించు నవ్వయైక, పావనుఁడు వేమజనపతి గేవలుండె. 22

తే. తనకు నద్దంకి తగురాజధానిగాఁ బ, రాక్రమంబున బహుభూము లాక్రమించి
యనుజతనుజబాంధవమిత్రజనుల కిచ్చె, నెదురెవ్వారు వేమభూమీశ్వరునకు.

క. దైతేయారికి మాఱట, చేతులక్రియ నొప్పి రెందుఁ జేదోడై వి
ఖ్యాతులు [8]తమ్ములు వేమ, క్ష్మాతలపతి కన్నవిభుఁడు మల్లప్రభుఁడున్. 24

వ. అయ్యిరువురయందును. 25

ఉ. అన్నచమూవరుండు సకలార్థసమన్వితుఁ డన్నదానసం
పన్నుఁ డభిన్నబాహుబలభాసి భవాంఘ్రిసరోజపూజనా
సన్నుతితత్పరాత్ముఁ డవసన్నవిరోధి ప్రసన్నభావుఁ డ
భ్యున్నతశాలి [9]కీలితశుభోదయుఁ డార్జితుఁ డయ్యె నెయ్యెడన్. 26

వ. తదనంతర [10]ప్రభుండు. 27

శా. బాహాదర్పమునం బ్రతీపధరణీపాలావలిం దోలి యు
త్సాహోదగ్రుఁడు మోటుపల్లి గొని సప్తద్వీపసద్వస్తుసం
దోహంబుల్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం [11]బ్రీతిఁ బోషించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్ల[12]రథినీనాథుండు గాఢోద్ధతిన్. 28

---

1. అని...నలరె. 2. చుట్టును గొల్లనాత్మసముశోభితభంగిఁ దనర్పనొప్పెఁ. 3. ధీరు. 4. పుణ్య పెద్ది యే. 5. బొదలున్. 6. జన. 7. మాళయ. 8. వెలసిరి. 9. కీలిత. 10. ప్రభవుండు. 11. ప్రీతుఁ గావించుచున్. 12. ధరణీ.

క. రామునకు లక్ష్మణుఁడు సు, త్రామసుతుఁడు ధర్మజునకుఁ దగ సౌభ్రాత్రం
బేమెయి నెఱపుదు రామెయి, వేమప్రభుఁ గొల్చె మల్లవిభుఁడును భక్తిన్. 29

శా. వేమ[1]క్ష్మాధిపు కూర్మిపుత్త్రుఁడు దయావిభ్రాజియవ్యాజతే
జోమార్తాండుఁడు కీర్తనీయసుగుణస్తోమంబులం దేమియుం
రామస్వామికి [2]లోచ్చుగాక సరియై రాజిల్లు [3]రాజార్చితుం
డాముష్యాయణుఁ డెందుఁ బోతయచమూపాగ్రేసరుం డిమ్మహిన్. 30

వ. తదీయానుజుండు. 31

క. దానంబునఁ గర్ణునిసరి, మానంబున భీష్మునిసమానుఁడు బుధస
న్మానచతురుండు ప్రోలయ, సూనుఁడు గోమటి [4]సమస్తసులభుఁడు కరుణన్. 32

వ. వేమధాత్రీపతికిఁ బరమమిత్త్రుండును సకలజగజ్జైత్త్రుండును నగు మాతుల
ప్రియపుత్త్రుండు. 33

మ. జయ మేకయ్యమునందు నెంతటిరిపుక్ష్మానాథులం జెందనీఁ
దయసంపన్నత నెన్నఁడుఁ వెలితిగాఁ డాద్యక్రమాయత్తమై
నయ మాత్మీయముగాఁ జిరస్థితుల నానందించు నాఢ్యుండు చి
ట్టయనూకప్రభుఁ డిద్ధసత్త్వగుణని[5]ష్ఠంబట్టి పుణ్యుం డిలన్. 34

వ. ఇట్లు [6]సకలసమృద్ధులఁ బ్రసిద్ధప్రభావుండైన వేమజననాథుం డొక్కనాఁడు
ప్రమోదంబు మిగులం బేరోలగం బుండి. 35

క. అంబుజభవనిభుఁడును బో, తాంబావిభుఁడు నగు సూరనార్యునిసుతు న
న్నం బూజితధూర్జటిచర, ణాంబుజు శ్రీవత్సగోత్త్రు నంచితచరితున్. 36

వ. సవినయంబుగాఁ బూజించి యిట్లనియె. 37

తే. సకలభాషాకవిత్వవిశారదుఁడవు, సాధుసమ్మతుఁడవు నిత్యసౌమ్యమతివి
భవ్యుఁడవుగాన నీమీఁదఁ [7]బరగఁ బత్తు, మేను గలిగియుండుదు నెప్పు డెఱ్ఱనార్య.

శా. నాతమ్ముండు ఘనుం[8]డు మల్లరథినీనాథుండు నిన్నాతత
[9]శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిం జేపట్టి మాకిచ్చుటం
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం బొందితి నింక నేను దనియన్ గావ్యామృతాస్వాదనన్. 39

క. భారతపరాంశ మని యిం, పారఁగఁ జెప్పుదురు బుధులు హరివంశము నీ
వారమ్యకథఁ దెనుంగుగ, ధీరోత్తమ నిర్వహించి తెలుపుము మాకున్. 40

వ. అనినం బ్రహర్షితపులకితదేహుండనై యమ్మహాభాగునిసమగ్రసంప్రార్థనంబుఁ
గృతార్థతాకలిత[10]వృత్తం బగుచిత్తంబునం గైకొని యిట్లంటి. 41

1. క్ష్మావిభు. 2. ని బోలుఁగాక. 3. రాజిల్లె. 4. సమగ్రసులభుఁడు. 5. ష్ఠాపుణ్యాగ; ష్ఠాగణ్యాపు. 6. సర్వసిద్ధుల. 7. బరఁగు పత్తు. 8. దగుచున్న. 9. శ్రీకత్రి. 10. వృత్త.

ఉ. నన్నయభట్టతిక్కకవినాథులు చూపినత్రోవ పావనం
బెన్నఁ బరాశరాత్మజమునీంద్రునివాక్యము నాదిదేవుఁడా
వెన్నునివృత్త మీవు కడువేడుకతో వినునాయకుండ వి
ల్లెన్నియొ సంఘటించెద మదభీప్సితసిద్ధికి రాజపుంగవా. 42

క. కావునఁ జెప్పెదఁ గల్యా, ణావహమహనీయరచనహరివంశము స
ద్భావమున నవధరింపుము, భూవినుతగుణాభిరామ ప్రోలయవేమా. 43

వ. అని యమ్మహీనాయకుఁ గృతినాయకత్వంబున కభిముఖుంగా నొనర్చి జగద
ర్చితం బగుప్రబంధంబు నిర్మింప నుపక్రమించితి నవ్విధం బెట్లనిన. 44

కథాప్రారంభము

సీ. [1]సౌమ్యంబు జగదేకరమ్యంబు నగునైమిశారణ్యమునఁ బుణ్యజనశీలు
రై యున్నయాశౌనకాదిసన్మునులు [2]ప్రసిద్ధువేదవ్యాసుశిష్యు ననఘు
రోమహర్షణపుత్త్రు రుచిరవాగ్వైభవు నుగ్రశ్రవసుం డనుకథకవర్యు
నర్థిఁ బూజించి మహాభారతాఖ్యాన మఖిలంబు వరుసతో నతనివలన
తే. విని [3]మనంబులు సమ్మోదవనధి నోల, లాడుచుండంగ వెండియు నంత తృప్తి
సనక నూతనకౌతుకసంప్రయుక్త, హర్షరభసులై యిట్లని రతనితోడ. 45

శా. వ్యాసప్రోక్తము భారతాగమము నీ వత్యంతహృద్యోక్తి వి
న్యాసం బొప్పఁగ విస్తరింపఁగఁ గడున్ హర్షించె వీనుల్ సము
ల్లాసోద్భాసిని యయ్యె బుద్ధి శ్రుతితుల్యం [4]బద్భుతార్థోదయ
శ్రీసంభావిత మిప్పురాణము ప్రశంసింపంగ నిట్లొప్పునే. 46

ఉ. ఇమ్మహితేతిహాసమున నెందును నబ్భరతాన్వయప్రసం
గమ్మునఁ బూర్వభూపతులకర్మవిశేషములున్ గుణప్రకా
రమ్ములు దేవదైత్యమునిరాక్షసయక్షఖగాదిపుణ్యవృ
త్తమ్ములు ధర్మనిశ్చయవిధమ్ములు పెక్కెఱిఁగించి తెంపుగన్. 47

ఉ. కౌరవపాండవప్రభవగౌరవలీలలు నీవు చెప్పఁ దీ
పారెడుభంగి వింటిమి గుణాకర యింక జగత్త్రయంబునన్
ధీరులు శూరులున్ విభవదీప్తులు నా నుతిగన్నయాయదు
క్ష్మారమణాన్వయోత్తములచందములున్ విన వేడుకయ్యెడున్. 48

వ. తదీయజన్మచరిత్రప్రపంచంబు సమస్తంబును విస్తరప్రశస్తంబుగా నుపన్యసింప
వలయు ననిన నక్కథకుండు ప్రముదితహృదయుండై వారలం గనుంగొని మీరు
వినం గోరిన యీయర్థంబు జనమేజయజననాయకునకు వైశంపాయనుండు చెప్పి

1. కామ్యంబు. 2. ప్రసిద్ధుఁడౌ వ్యాసుని. 3. మనంబున సంతోష. 4. బద్భుతాపాదన; బద్భుతాపాదక.

నది యేనునుం జెప్పెద వినుండు మహాభారతశ్రవణానంతరంబ యాపరీక్షిత్తన
యుండు పరాశరతనయశిష్యున కిట్లనియె. 49

సీ. మునివర కురువంశమును యాదవాన్వయంబును నాదుమదికొక్కప్రోవ కాఁగఁ
దోఁచుఁ గౌరవకోటిఁ దొడరి కీర్తించుచో యాదవులను జెప్పి తచట నచట
నంతటఁ దృప్తి నాయంతరంగంబున కొదవదు తద్వృత్త మొకటి గొఱఁత
వడకుండఁ బ్రత్యక్షపరిచితం బైనదిగాదె నీబుద్ధికిఁ గాన యిప్పు

తే. డీవు సెప్పఁగ వినుట సమిద్ధహర్ష, కరము పరమేష్ఠి మొదలుగాఁ గ్రమముతోడ
వలయుఁ బ్రఖ్యాతపురుషులవర్తనములు, గూడ నెఱిఁగింపవే వృష్ణికులమువిధము.

క. అని బహుమానముగా నడి, గినజనమేజయున కతులకృప వైశంపా
యనముని యిట్లను నభినం, దనపూర్వకముగ నుదాత్తతరహృద్యోక్తిన్. 51

చ. విను హరివంశనామమున విశ్రుతమైనపురాణ మగ్రిమం
బనుపమవాగ్విశేషవిభవాఢ్యుఁడు సత్యవతీసుతుండు సె
ప్పినయది యేను నీకు వినిపించెదఁ బూజ్యతమంబు వంశవ
ర్ధనము సమస్తపుణ్యఫలదం బిది శ్రోతకు వక్తకుం నృపా. 52

ఉ. భాసితశుద్ధియుక్తుఁడవు భవ్యయశుండవు నైననీవ యు
ద్భాసితబుద్ధియుక్తమును భవ్యయశంబును నైన[1]యాదవో
ల్లాసచరిత్రముం వినఁ దలంపఁగ నర్హుఁడ విద్ధవైభవ
శ్రీసుఖసుస్థిరాయువులఁ జెందఁగఁ బాత్రమవై తనర్పుటన్. 53

### సంక్షేపరూపంబగు నాదిసృష్టిప్రకారము

వ. తత్ప్రకారంబునకుఁ బ్రారంభం బెట్లనిన నఖిలేశ్వరుం డగుపరమాత్ముం డాత్మ
యోగంబున నాత్మయుం బ్రకృతియు ననుతత్త్వమిథునంబు నిర్మించెఁ బ్రకృతికి
మహత్తును మహత్తునకు నహంకారంబును నహంకారంబునకుఁ బంచ
భూతంబులుం బ్రభవించె నాభూతంబులవలన ననేక[2]భూతభేదంబు లుద్భూతంబు
లయ్యె నిది సనాతనస్థైనసృష్టికి సంక్షేపంబు తక్కినయవి దీనికి విస్తారావయవంబు
లవి యెట్లు వినిన నవహితుండవై యాకర్ణింపుము. 54

సీ. అఖిలజగత్సృష్టి నాత్మ నపేక్షించి యాత్మోద్భవుండు నారాయణుండు
జలముల సృజియించి సమధికం బగు[3]నిజవీర్యమం దిడుటయు విస్మయముగ
విమలహేమాకృతి సమరుమహాండమై కర మొప్పెఁ దదబ్భారిగర్భమూర్తి
యై యుండి బహువత్సరాత్మకం బగుకాల మేఁగిన నది యవియించుకొనుచుఁ

తే. బుట్టె యజుఁడు [4]క్రిందటిప్రయ్య భువియు [5]మీఁది
ప్రయ్య దివియును నడు మంబరంబుఁ జేసి

1. యాదవోల్లాసి. 2. భూతంబులు పుట్టె. 3 నట్టి. 4. క్రిందటిప్రక్క. 5. మీఁదిప్రక్క.

దిశలు కాలంబు మనసు బుద్ధియును వాక్కు
గామరోషరత్యాదిసర్గము నొనర్చె. ౫౫

వ. మఱియు నతండు మరీచి యత్రి పులస్త్యుండు పులహుం డంగిరసుండు గ్రతువు వసిష్ఠుండు ననువారి నేడ్వుర నుత్పాదించె నమ్మహాత్ములు క్రియానిరతులుఁ బ్రజాపతులునై వెలసి రాహిణ్యగర్భుండు నిజరోషంబున నంతకుం గలిగించె యోగవిద్యాప్రభుండుగాను సనత్కుమారు సృజించె మేఘవిద్యుదింద్రధనువుల నశనిరోహితనిర్ఘాతకేతువులఁ బర్జన్యపూర్వకంబుగాఁ బుట్టించె ఋగ్యజుస్సామాథర్వణంబులు సంపాదించి యజ్ఞ[1]సిద్ధికిం బ్రతిష్ఠించి సర్వగాత్రంబుల ననేకభూతంబుల నిర్మించె నిట్లు ప్రవర్తిల్లిన సృష్టికి నభివర్ధనంబు గోరి. 56

క. తన[2]మేని రెండుసగములు, వనితాపురుషులుగఁ జేసి స్వాయంభువుఁడన్
మనువును శతరూపాహ్వయ, మనుపత్నియుఁ గా నొనర్చె మహిమోజ్జ్వలుఁడై

వ. వార[3]లిద్దఱకుఁ బ్రియవ్రతోత్తానపాదులు జనియించి రందు. 58

సీ. ధర్మునిసుతసూనృతాదేవి యుత్తానపాదునివలన సంపన్నయశులు
ధ్రువుఁ డనఁ గీర్తిమంతుం డనఁగాను నాయుష్మంతుఁ డన [4]మహాద్యుతి యనంగ
ననఘులనలువురఁ గనియెఁ బుత్త్రుల నందు ధ్రువుఁడు నిష్కలనిష్ఠతోడ మూఁడు
వేలు దివ్యాబ్దముల్ వినుతతపంబు గావించి విరించి మెచ్చించి సప్త

తే. మునులకంటె మీఁదై యొప్పు ననుపమాన, సుస్థిరజ్యోతిరాత్మకస్ఫురితపదవి
వడసె సర్వగీర్వాణతపస్విసిద్ధ, సమితి యాశ్చర్యమునఁ దన్ను [5]సంస్తుతింప. 59

వ. అట్టిధ్రువునకు శంభు వనుదానికి శ్లిష్టియు భవ్యుండును ననుకొడుకులు పుట్టిరి శ్లిష్టికి సుచ్ఛాయ యనుసతి రిపు రిపుంజయ పుణ్య(ష్ప)వృకల వృకతేజసుల నేవురం గనియె నందు రిపునకు [6]బృహతికిం జాక్షుషమనువు జనియించె. 60

క. ఆతండు పుష్కరిణి యను, నాతికి వీరణసమాఖ్యనందనుఁ గనియెన్
బ్రీతి యొసఁగ [7]నడ్వల యను, గోతి యతనివలనఁ గాంచెఁ గొడుకులపదుగన్. 61

వ. ఊరుండునుం బురుండును శతద్యుమ్నుండును దపస్వియు సత్యవాక్కును గవియు నతిరాత్రుండును [8]నగ్నిష్టుత్తును [9]సుద్యుమ్నుండును నభిమన్యుండు నననంబరఁగిన యాపదుండ్రయందును బెద్దవాఁడై నయూరునకు నాగ్నేయియందుఁ గ్రమంబునఁ నంగుండు సుమనుండు [10]ఖ్యాతి క్రతు వంగిరసుండును గయుండు నన నార్వురు పుట్టి రందు నంగుండు మృత్యుపుత్త్రి సునీథం బరిణయంబై వేనుం డను కొడుకుం బడసె నతండు. 62

---

1. సృష్టి. 2. మేను. 3. లిద్దఱికి. 4. యశస్వంతుఁ డనఁగ?. 5. సన్నుతింప. 6. బృహస్పతికిం. 7. నత్వలయను, నాతి యతనివలనఁ గాంచె నందనులదగన్. 8. అగ్నిష్టువును. 9. సత్యద్యుమ్నుఁడును 10. స్వాతి.

ఉ. ధర్మువు దప్పి తాపసమతంబున కంకిలిపా టొనర్పఁ గ్రో
ధోర్మిమహాత్ములై తపసు లొక్కట నాతని [1]దక్షిణంపుఁగే
ల్నిర్మథనంబు సేసిన జనించెఁ బృథుం డనురాజతండు స
త్కర్మధురీణుఁడై నిలిపె ధార్మికసేవిత మైనమార్గమున్. 63

క. అంతియ కాదు వసుంధర, యెంతయు గోరూపఁ జేసి యిచ్చెఁ గుశలుఁడై
సంతతబహువస్తునివహ, మెంతవలచి రెవ్వరంత యేర్పడఁ గురియన్. 64

వ. అతనికి హవిర్ధాన యనుమానినికి శిఖండిహవిర్ధానులు జనియించిరి శిఖండికి ధిషణ యను తెఱవకుఁ బ్రాచీనబర్హియు శుక్లుండును గయుండును గృష్ణుండును నధ్వరుండును నజినుండును ననునార్వురు వొడమిరి ప్రాచీనబర్హికి సముద్రపుత్రి యైనసవర్ణయందుఁ బ్రచేతసు లనువారు పదుండ్రు ప్రభవించి పదివేల వర్షంబులు ఘోరతపంబు సేసి సోమకన్యక యగుమారిషం దమకు ధర్మపత్నిఁగా పరియించి యయ్యింతియందు. 65

క. దాక్షిణ్యధనునిఁ గాంచిరి, దక్షు నశేషక్రియైకదక్షుఁ బ్రభుఁ బ్రజా
ధ్యక్షునినసదృశతేజుని, సాక్షాత్పరమేష్ఠిఁ బరమసంయమశీలున్. 66

వ. అని చెప్పిన విని జనమేజయుం డతని కిట్లనియె. 67

తే. [2]ఆయజుని కాలిపెనువ్రేలియందుఁ బుట్టె, దక్షుఁ డన వింటిఁ [3]దొంటికథాప్రసక్తి
నిపుడుప్రాచేతసుండనియెదు మునీంద్ర, యివ్విధం బేమి దెలియంగ నెఱుఁగవలయు.

వ. సోమదౌహిత్రుం డైనయతండ యాసోమునికి మామ యెట్లయ్యె నని యడిగిన వైశంపాయనుం డిట్లనియె. 69

మ. విను సర్గంబు లయంబు భూతముల కుర్వీనాథ నిత్యంబు లెం
దును జన్మింతురు దక్షుఁ డాదియగునాద్యుల్ సర్వకల్పంబులన్
జనికిం గారణముల్ పృథగ్విధములై సంధిల్లు లే దెవ్విధం
బున నూహింపఁగఁ బిన్న పెద్ద యగుచొప్పు న్వావియున్ వారికిన్. 70

ఉ. గౌరవలాఘవంబులకుఁ గారణ మిందఱకున్ దపస్సమా
చారము తారతమ్యము నిజం బిది జన్మగురుత్వహీనతల్
గోరి గణింప రివ్విధి యకుంఠితబుద్ధి నెఱుంగు పుణ్యుఁ డిం
పారఁగఁ బొందుఁ గాంక్షిత[4]సుఖాగమమున్ బరలోకభద్రమున్. 71

సీ. తొలితొలి సృష్టికిం దొడఁగి యంబుజసూతి దలపోయ నాతనితలఁపునందు
మునిదేవదానవమనుజాదిభూతంబు లొక్కట జనియించి యక్కజముగ
నవి యెన్నియును గల్గె నన్నియయ్యై యుండెఁ గాని వర్ధిల్లుట గలుగ దయ్యె
నివ్విధం బటుసూచి యించుక చింతించి భూతవృద్ధికి హేతుభూత మొకటి

1. దక్షిణంబ మే, న్నిర్మ. 2. ఆజునికుడికాలిపెనువ్రేలి. 3. దొలుత. 4. శుభా.

తే. గాంచి మిథునధర్మంబు నిర్మించెఁ దత్ప్ర, ధానసంప్రయోజనకారి[1]దక్షతకును
జనికి సంకల్పదర్శనస్పర్శనముల, తొల్లి హేతువులై చెల్లు దురితదూర. 72

వ. ఆదక్షప్రజాపతికి వీరణపుత్త్రి యైన యసిక్నియందుఁ బుత్త్రసహస్రపంచకంబు పుట్టి తండ్రిపనుపున భూతసృష్టిసేయ నుత్సహించునెడ నారదుండు సనుదెంచి. 73

ఉ. బాలురు మీర లీధరణిభాగము క్రిందును మీఁదు దిక్కులున్
మూలలు నెంత యక్కొలఁది ముందఱ నిక్క మెఱింగి కాక యు
క్కీలయి యిట్లు సృష్టిపనికిం దమకింపఁగఁ జన్నె యన్న వా
రోలిన యన్నివంకలకు నొక్కట నారయ నేఁగి రందఱున్. 74

క. అమ్మెయిఁ జని యొకఁడైనన్, గ్రమ్మఱఁ జనుదేఁడ తత్ప్రకారంబునకు
ల్లమ్మెరి[2]యఁగ నాదక్షుఁడు, క్రమ్మఱ నాత్మజసహస్రకముఁ బుట్టించెన్. 75

వ. వారు ముందఱివారియట్ల ప్రజలసృజియింపం దొడంగినఁ దొంటిచందంబున నారదుం డరుగుదెంచి పలికిన. 76

తే. ఇయ్యకొని లెస్సపని సెప్పె నిమ్మునీంద్రుఁ
డాదిఁ జన్న[3]వారలక్రమ మరయవలదె
యనుచు [4]నన్నిదిక్కులకు నత్యాదరమునఁ
బోయి యా[5]లోకలన డిందిపోయి రనఘ. 77

క. [6]అది గతముగ భ్రాతసనిన, పదవి యరయఁ బోక సనదు భ్రాతకయని చె
ప్పుదు రాద్యు లవ్విధమ్మున, వదలి చనినయాత్మజులకు వనరుచు మఱియున్. 78

వ. దక్షుండు నిజపత్నియం దఱువండ్రు కూఁతులం గని ధర్మునకుం బదుండ్రను గశ్యపునకుం [7]బదుమువ్వురను జంద్రునకు నిరువదియేడ్వుర నరిష్టనేమికి నలువురను గృశాశ్వునకు బహుపుత్త్రునకు నంగిరసునకు వేర్వేఱ నిద్దఱిద్దఱ నిచ్చె వారివలన వసురుద్రాదిత్యవిశ్వసాధ్యాదిదేవతలును దైత్యదానవయక్షరాక్షస గంధర్వాప్సరోవిహంగ [8]భుజంగమప్రముఖులుం బ్రభవించిరి. మఱియు గోగజాశ్వ[9]ఖరోష్ట్రసింహశార్దూలాద్యఖిలక్షుద్రజంతువులును జనియించె వృక్షతృణలతాగుల్మాదులు నుద్భవించె నందుఁ గశ్యపభార్య యైనదితిదేవి హిరణ్యకశిపు హిరణ్యాక్షులం గనియెం దత్సంతానం బపరిమేయంబై యదితిసంతతి యైన యాదిత్యులతో విగ్రహించె నట్టి విగ్రహంబున. 79

## ఇంద్రుఁడు వజ్రాయుధముచేత దితిగర్భంబు ఛేదించినప్రకారము

మ. అమరశ్రేణికి దైత్యసంతతికి నన్యోన్యాహవం బుద్ధత
క్రమరోషంబున నైన నందు సురవర్గం బేచి యవ్వైరిసం

---

1. దక్షుఁ డొకఁడ. 2. యంగా దక్షుఁడు. 3. వారిక్రమంబు నరయ. 4. నట్టి. 5. లోకల నడంగి. 6. అది గతముగ భ్రాతచనిన పదవి యరయఁ బోక వనును భ్రాతకనని. 7. పదుమువ్వురు. 8. భుజంగ. 9. ఖరతురగ.

ఘములో ముఖ్యులఁ బల్వురం దునుమ శోకం బంది దైతేయమా
త మనోవల్లభుఁ గశ్యపుం బ్రకటతాత్పర్యంబునం గొల్చినన్. 80

క. ఆతఁడు ప్రసన్నుఁడై య, న్నాతికి వరమడుగుమనిన నాకేశు ననిన్
ఘాతింపఁగ నోపెడుసుతు, నాతతబలు నవ్వరాంగి యర్థించుటయున్. 81

తే. అమ్మహాత్ముఁ డాయమతోడ నబల నీవు, శుచిత నెప్పుడు నేమఱక చలవృత్తిఁ
దగిలి నూఱబ్దములు చూలు దాల్పనోపు, దేని నట్టిపుత్త్రుఁడు జనియించు ననిన.

వ. అయ్యిగ్మలి యయ్యుగ్రవృత్తంబు నడప నొడంబడియెం గశ్యపమునియు గర్భ
ప్రదానంబు సేసి తపోవనంబున కరిగె నమ్మగువ నిత్యంబునుగాఁ ద్రికాల
స్నానంబును వివిధోపవాసవ్రతంబులుం బూని శుచియై యుండె నంతఁ దదంతరా
యా[1]పేక్షుండై సహస్రాక్షుండు సనుదెంచి నమస్కరించి తల్లీ నీవు వ్రతస్థితవై
యునికి యెఱింగి శుశ్రూష యాచరింప వచ్చితి ననిన నమ్ముగ్ధ సంతసిల్లి. 83

మ. తనయా [2]యొంతయు మేలు సేసి తిటు మత్సామీప్యసంసేవివై
యనురూపస్థితి నుండు పుబ్ధశతపర్యాప్తిఁ జనింపంగ నీ
యనుఁగుందమ్ముని జూచు నుత్సవము నీకబ్బుఁ జగం బంతయున్
విను మీ రిద్దఱుఁ గూడి యేలుఁడు కడున్ విఖ్యాతి సంధిల్లఁగన్. 84

క. అనియె నతండును దత్సే, వనతాత్పర్యంబు [3]తగ నెపం బిడి యేప్రా
ద్దును [4]నెడమడు గగుమదితోఁ, ననువర్తింపంగఁ గించిదవశిష్టముగాన్. 85

వ. సంవత్సరశతం బతిక్రాంతం బైన నొక్కనాఁ డమ్ముదిత పాదశౌచంబుసేయమఱచి
నిద్రితయైన నది రంధ్రంబుగాఁ దదీయోదరంబు సొచ్చి జంభారి దంభోళిం గొని
తద్గర్భం బేడుప్రయ్యలుగా వ్రేయ నయ్యర్భకుండు రోదనంబు సేసిన. 86

క. మా రుద యని పలుకుచు నతి, దారుణరోషంబుతోడఁ దచ్చకలము ల
వ్వీరుఁ డొకటొకటి యేడే, డై రూపఱ నడిచె నంత నభ్యర్థితయై. 87

క. అసురజనని కడునార్తిని, వసమఱి యిటు సేయఁ దగునె వాసవ యనఁగాఁ
ద్రసదంతరంగుఁ డగుచును, వెస వెలువడి విబుధవిభుఁడు వినతాంగుండై. 88

చ. అడుగులయందు శౌచవిధి యాత్మ నొనర్పఁ దలంప కీవు కా
ల్గడఁ దలయుంపిగా నిదుర గైగొన నేనిది యంతరంబుగాఁ
గడఁగి మదంతహేతు వగుగర్భము నొంచితి దీనిఁ దప్పుగాఁ
దడవక సైఁపఁగా వలయుఁ దల్లి నినుం గొనియాడు లోకముల్. 89

చ. అనవుడు నింద్రుతో ననియె నమ్మునిపత్ని యొకింత యేనిఁ గీ
డన వశమే భవచ్చరిత మంతయు లెస్సయ కాక యింక నా

1. పేక్షితుండై. 2. యొంకటి. 3. దగు. 4. నెడగొరినపుటితో, ననువర్తింపంగనుండె.

కు నొకటి మేలు సేయఁగఁ దగుఁ గులిశాహతి[1]చేత నైనయ
త్తనుశకలంబు[2]లన్నియు వధం బొనరింపక కావు మింతటన్. 90

వ. ఈ నలువదితొమ్మిదియును దేవతలై నీవు మా రుద యనుట కారణంబుగా మారుతు లనం బరగి దేవాసురసమరంబులందు నీకుం జేదోడై[3]నడువవలయు దీనికి నొడంబడు మనియె నతం డవ్విధంబునకుం బ్రియంబు నొందె నిది సకల భూత సంభవప్రకారంబు. 91

క. ఈ సృష్టివిధం బెఱిఁగిన, భాసురపుణ్యుండు సకలభయములవలనన్
బాసియు నతులైశ్వర్య, శ్రీసౌఖ్యము లొందు మోక్షసిద్ధియుఁ గాంచున్. 92

వ. విను మివ్విధంబునం గలిగిన భూతవిశేషంబులకు నజుండు ప్రత్యేకంబ యధికారులం గలిగించి యభిషేకం బొనర్చె నంతయు వివరించెద. 93

సీ. పృథుఁడు భూపతులకుఁ బెద్దవాఁడై యుర్వి యంచితనీతిఁ బాలించువాఁడు
ద్విజతారకాతరువ్రజయజ్ఞములకు నుజ్జ్వలతపంబుల కోషధులకు సోముఁ
డర్థసంపదలకు[4]నంబుధివితతికి రాజస్యులకును వైశ్రవణుఁ డొడయుఁ
డఖిలభూతముల ననంతపిశాచసంచయముల శాసించుఁ జంద్రధరుఁడు

తే. విష్ణుఁ డాదిత్యులకు వసువితతి కగ్ని, జలములకుఁ బాశపాణి వేల్పులకు నింద్రుఁ
డసురకోటికిఁ బ్రహ్లాదుఁ డంతకుండు, పితృసమూహంబునకు నధిపతులు వరుస. 94

క. నాగులకు వాసుకియుఁ బెఱ, భోగులకుం దక్షకుఁడుఁ బ్రభులు పక్షులకున్
నాగాంతకుండు మనుజవ,రా! గంధర్వులకుఁ జిత్రరథుఁడును నొడయుల్. 95

క. కరులకు నైరావతమును, హరులకు నుచ్చైశ్శ్రవంబు నవనీస్థలిపై
నరులకు నృపతియు హిమగిరి, గిరులకు నేఱుల కుదధియుఁ గీర్తిత[5]ధర్తల్. 96

వ. ఇదియాదిగా నాదిసర్గంబునం బరమేష్ఠి నియమించినయాధిపత్యంబు లట్లు నిశ్చయించి యాజగద్ధాత ధాత్రి యంతయు నాలుగు చెఱంగులుగా నేర్పఱిచి యందుఁ బూర్వదిక్కున విరాట్పుత్త్రుం డగు[6]వైరాజును దక్షిణదిక్కునం గర్దమపుత్త్రుం డగుశంఖపదుండునుం బశ్చిమదిక్కున రజఃపుత్త్రుం డగు కేతుమంతుండును నుత్తరపుదిక్కునం బర్జన్యపుత్త్రుం డగుహిరణ్యరోముండును బరిరక్షకులుగాఁ బ్రతిష్ఠించె నన్నలువురు రాజులును మధ్యమభూమీశ్వరుం డగుపృథుండు తమకు ననుశాసకుండుగా భాసిల్లి రివ్విధంబునం బూర్వులచేత నీయుర్వీసర్వపర్వతద్వీపసాగరసమేతయైయనుభూతిం బొందె నంతంజాక్షుషమన్వంతరానంతరంబున వనజభవుండు వైవస్వతమనువునకు సమగ్రసామ్రాజ్యం బొసంగె ననిన విని జనమేజయుండు. 97

1. చేసియైన. 2. లిన్నియు. 3. బంటులుగావలయు. 4. యక్షరాక్షసులకు. 5. భర్తల్. 6. సుధన్వుని.

చ. మునివర యెవ్విధంబున సముద్భవ మొందెఁ బృథుండు? ధాత్రి యే
యనువున దోహయోగ్య యగునట్లుగఁ దా నొనరించె? నెవ్వ ర
మ్మనుజవరేణ్యుపన్పున సముంచితవస్తువిశేషదోగ్ధలై
రనయముఁ జిత్ర మట్టితెఱఁగంతయు నా కెఱిఁగింపు నావుడున్. 98

పృథుచక్రవర్తి భూమిని గోవుఁగాఁజేసి వస్తువులు గొన్న ప్రకారము

వ. అతనికి వైశంపాయనుం డిట్లనియె. 99

సీ. ఆదియుగంబున నంగుండు నాఁ జను భూమీశ్వరుఁడు మృత్యుపుత్రి యైన
నీరజనయన సునీథయం దధికబాహాసముద్ధతు వేనుఁ డనుతనూజుఁ
గనియె రాజై వాఁడు తనమాతామహుఁ బోలి క్రౌర్యంబునఁ బుడమిజనులఁ
బీడించి ధర్మంబుఁ బెడఁబాయఁగాఁ ద్రోచి వేదవిరుద్ధదుర్వృత్తి మరగి
తే. యెల్లవారలఁ బిలిచి మీ రేసుకృతము, నాచరింపంగ వలదు మీ రధ్వరముల
తెరువు వోకుఁడీ మేర నతిక్రమింతు, రేని జంపుదుఁ జెఱుతు నెవ్వానినైన. 100

తే. యజన మిజ్యుండు యష్ట నా నతిశయిల్లు, నిన్ని తెఱఁగులవస్తువు లేన కాఁగఁ
దలఁపుఁ డేమేనికర్జంబు గలిగెనేని, [1]బన్నుగా నది చేయుఁడు నన్ను గుఱిచి. 101

వ. అని యాజ్ఞాపనంబు సేసిన. 102

సీ. జపములు గాయత్రి సహితంబుగా [2]మానె వేదంబు పేరును వినఁగ లేద
సోమపానక్రియచొప్పులు [3]రూపతె హుతములు కఱవయ్యె హుతవహునకు
సర్వదైవతసమర్చలు గట్టిపెట్టంగఁ[4]బడిన భూతంబులపనులు సమసెఁ
బరహితంబులు దానపరతలుఁ గడతేఱె సతతవ్రతోపవాసములు పొలిసె
తే. [5]స్వామిచందంబు చందమౌ జనుల కనిన, మాట నిజముగ వేనకుమాతలేశుఁ
డఖిలధర్మపరాఙ్ముఖుఁ డయిన నతని, మతము చెల్లించి రెందును మనుజకోటి.

వ. [6]ఆమెయిఁ దలంకి తపస్వివరులెల్ల నమ్మహీపాలుపాలికిం జనుదెంచి. 104

మ. జనసంత్రాసనవృత్తిఁ [7]జేయఁదగునే సత్కర్మనిర్మూలనం
బొనరింప న్నృప నీకు నిట్లు విను మే మొప్పారఁ బెక్కబ్దముల్
[8]జనుయాగం బొనరింపఁ జూచెదము విశ్వక్షోణికిఁ రాజ వీ
వనుకూలుండవు గమ్ము మాక్రియకు ధర్మాయత్తచిత్తంబునన్. 105

తే. క్షత్త్రియునిఁ దెచ్చితొలితొలి గద్దియనిడి, పట్టబద్ధుఁ గావించుచోఁ బ్రజలు దమ్ముఁ
గావ ధర్మంబు నడపను గాదె సమయ, మర్థిఁ బలుకుదు రీవది యరయవలదె. 106

---

1. బన్నుగాఁ జేయుఁడీ మీరు నన్నుఁ గుఱిచి. 2. మానె. 3. రూపెను. 4. బడియెఁ బూర్తంబుల (పూ. ము.) 5. స్వామిచందంబు సేవకజనుల, స్వామిచందంబె చందము; స్వామి భృత్యులచందంబుజనులకనిన, మాట నిజము లేదయ్యె జ్ఞాతలేశు. 6. అమ్మెయిఁ దలరి. 7. చేర్పఁ దగునే. 8. వినుయాగంబు దొడంగఁజూచెదము నీవీ (పూ. ము.)

మ. అనినం జెల్పిన నవ్వియమ్మునులతో నాతండు సన్నొక్కరుం
డనుశాసింపఁ బ్రభుండె ధర్మమున కధ్యక్షుండ నేనొల్లకుం
డిన సర్వోర్వియుఁ ద్రొక్కి తోయములలో డిందింతు [1]మిన్నైన వ్ర
త్తు నశేషాండ[2]పుటంబు గాల్తు వల దీదుర్వాక్యముల్ మాదెసన్. 107

వ. మీ రేమియు నెఱుంగ రూరక పొం డనుటయు వారు మఱియును బెక్కు తెఱంగులం [3]బలుకం దొడంగి తా రెంత దెలిపిన నాదుర్వినీతుండు తనదుర్వినయంబు చూపం గడంగినం గినిసి నిజతేజోబలంబున నాబలశాలిం [4]బట్టి మిడుకమిడుకం ద్రొక్కి మంత్రయుక్త[5]కుశంబుల నతనియొడమతొడ [6]ద్రచ్చిన నందు. 108

క. కాళికకోలవి తెఱంగున, [7]గాళిమమగు కుఱుచమేను గలపురుషుఁ డొకం
డాలోకనదుస్సహుఁడై, యాలో జనియించి [8]భీతి నడుఁకుచు నెదురన్. 109

వ. కృతాంజలియై నిలిచినం జూచి మునులు నిషీద యని పలికి నిషేధించి రతండు కల్మషసంభవుండు నిషాదుం డనం బరఁగె వింధ్యప్రముఖసంచారు లగుపాప కారులు కిరాతకైవర్తాదు లెల్లఁ దత్సంతానజాతులై రమ్మహాద్విజులు మఱియును.

వేనశరీరమథనమునఁ బృథుఁ డుద్భవించినప్రకారము

క. [9]వెరవొప్పఁగ వేనజనే, శ్వరుదక్షిణకరతలంబు సంరంభముతోఁ
దరువంగ నరణిమథన, స్ఫురితుం డగు జాతవేదుపోలిక యమరన్. 111

ఉ. ఆజగవాఖ్యమై పరగునాద్యశరాసనమున్ సముల్లస
త్తేజము దీప్తబాణములు దివ్యకనత్కవచంబుఁ దాల్చి యు
ద్వేజితశత్రుఁ డప్రతిమదీర్ఘతనుండు జనించె రాజవి
ద్యాజితలోకుఁ డైన పృథుఁ డమ్మును లద్భుతవార్ధిఁ దేలఁగన్. 112

క. ఆతఁడు ప్రభవింప మహా, భూతము లన్నియును బ్రీతిఁ బొదలుచు సేవా
కౌతూహలమున నచటికి, నేతెంచె నుదాత్తమూర్తు లెంతయు వెలయన్. 113

మ. అభిషేకార్థముగా నిజోదకము లింపారంగఁ గొంచున్ సరి
త్ప్రభుఁ డాపూర్ణసరిత్సరస్సహితుఁడై ప్రాదుర్భవించెన్ సరో
జభవుం డింద్రుఁడు లోనుగాఁగలమరుత్సంఘంబుతో నేఁగుదెం
చె భువిన్ బేర్కలసంయమీంద్రతతి వచ్చెం బేర్చుమోదంబునన్. 114

ఆ. అట్లు జాతుఁ డైన యాసుపుత్రుండు పు, న్నామనరకమోక్షణం బొనర్ప
వేనుఁ డపుడ పుణ్యవృత్తి సంసేవ్యలో, కముల కరిగె సురలు గారవింప. 115

---

1. మిన్ను దహింతు; మిన్నందఱన్, దునిమం ద్రుంతు నశేషముల్ వలవదీదుర్వాదముల్ మాదెసన్. 2. ముఖాల్తు నింక. 3. జెలుపం. 4. బెట్టుకట్టి. 5. కుశస్థలంబుల. 6. దర్చిన నందు. 7. గాలంబగుకుఱుచమేనుగల. 8. చూడనడఁగుచు. 9. కరమొప్పఁగ.

ఉ. అమ్మెయిఁ గూడినట్టిఘను లందఱు నాతని నత్యుదగ్రపీ
ఠమ్మున నుంచి పెంపు ప్రకటంబుగఁ బావనమంత్రయుక్తతో
యమ్ముల సార్వభౌము విభవాఢ్యునిఁగా నభిషిక్తుఁ జేసి రొ
క్కుమ్మడి మ్రోసె దివ్యమురజోత్కటనాదము లెల్లదిక్కులన్. 116

వ. ఇవ్విధంబున [1]సవ్విశుద్ధతేజునకుం బూజితస్థైర్యం బగునైశ్వర్యం బొసంగి కృతకృత్యులై కృత్యవేదు లగునాచతుర్ముఖాదులు నిజస్థానంబుల కరిగిరి తదనంతరంబ.

క. ఏకాతపత్రముగ సిరి, గైకొని నృపమౌళి రత్నకలికాకలితా
లోకంబు చరణపీఠ, శ్రీ కున్నతి సేయఁ బృథుఁడు చెన్ను వహించెన్. 118

చ. తనజనకుండు ధర్మగతి దప్పుట నొప్పఱి తొల్లి యొల్లఁబో
యిన జనకోటి దాను గడు నెక్కుడుగా నొనరించు నాదరం
బున ననురంజనోత్సవముఁ బొందఁగ రా జను పేరి కొక్కఁడుఁ
బెనుపగుపాత్ర మయ్యె గుణపేశలుఁ డాతఁడు నీతిధన్యతన్. 119

చ. జలనిధులైన మెట్టలగు శైలములైన నడంగు [2]నవ్వియ
త్తలమయినం దలంబ యగు దావములైనఁ దిరోహితంబులై
తొలఁగు నతండు సంచరణదోహలముఁ బ్రసరించుచో రసా
తలసురధామసీమలను దద్రథ[3]రోధము లేదొకింతయున్. 120

క. దునకయు వెదపెట్టకయుఁ, దనరె నఖిలసస్యములును ధారుణి గోవుల్
పెనుపొందెఁ గామదోహిను, లనఁ దరువులు మధురమధుఫలాఢ్యము లయ్యెన్.

సీ. ఆసమయంబున నంభోజసంభవుయాగంబునందు [4]సుత్యాహమునను
సౌరిది సంజాతుఁడై సూతుండునాఁ జనుమునియుఁ దన్మఖకాలమునన జనన
మొంది మాగధుఁడు నా నొప్పుసంయమియు నయ్యజునాజ్ఞఁ గైవారులై దివిజుల
నలరించు పని నున్కి నందులఋషులు వేల్పులుఁ బ్రియంబునవారిఁ బిలువఁ బనిచి

తే. పృథునరేశ్వరుఁడిటమీఁదఁ బేర్మి నొసఁగఁ, జేయఁగల [5]కార్యములు సవిశేషకృతులు
నాత్మదృష్టిమైఁ గని మీర లతనియెదిరి, కేఁగి కైవార మొనరింపుఁ డింపు మిగుల.

వ. అని పనిచిన నమ్మహామనస్కులపనుపు గైకొని వార లరిగి యావైన్యుం గని మధురమనోహరగంభీరధీరపవిత్రచిత్రస్తోత్రంబుల నమ్మహాక్షత్రియు నుద్దేశించి యుపన్యాసంబులు సేసినం బ్రీతుండై యయ్యాదిమవదాన్యుండు సౌజన్యసుముఖత్వంబు శోభిల్ల సూతునకు సూతదేశంబును మాగధునకు మగధజనపదంబు నుద్యోగంబుగా నిచ్చిన నయ్యౌదార్యంబు సూచి కార్యాపేక్షులై మహీజనంబులు మన కితఁడు వృత్తిప్రదాత యగు నని కదిసి తమతమనేర్పు [6]లెలర్పం

1. సమిద్ధ. 2. నుర్వియొ. 3. దుర్గ. 4. సామాభిషుతము చోట. 5. కార్యములను విశేష. 6. తేర్పడం.

గొలువం జొచ్చి రట్టిసేవవలన నతనిచిత్తం బెఱింగి మాకు నెల్లనాఁటికి శాశ్వతంబులై నడుచు జీవనంబులు గావింప వలయు నని యభ్యర్థించిన నట్లకాక యని యొడంబడి. 123

పృథుచక్రవర్తికి భూదేవికి నైన సంవాదప్రకారము

సీ. ఆరాజపుంగవుం డతిరౌద్ర మగుశరాసనమును సందీప్తసాయకములు
గైకొని ప్రజలకుఁ గామితవస్తువు లెల్లకాలంబును నిచ్చుచుండుఁ
గాత యివ్వసుమతి యీతెఱం గొనరింప కున్న వ్రక్కలుగఁ జేయుదు ననంగ
వెఱచి గోరూపయై పఱచె మేదిని యమ్మహాయోగబలదుర్జయాత్ముఁ డలుక
తే. వెనుకొనంగ నాయమయును వనజభవుని, నెలవులోనుగజగములన్నియునుదూఱి
తూఱి యెచ్చోటుసొచ్చినఁదోనతగులు, వైన్యుఁగనుఁగొనితనుఁగాచువారు లేమి.

వ. అతనిశరణంబు సొచ్చి వినయవినమితోత్తమాంగయై యిట్లనియె. 125

చ. అధిప ప్రజాభిపోషణము నర్థి నొనర్పఁ దలంచితేని మ
ద్వ్యథ మొనరించి [1]నీవెటుల ధన్యత నొందెదువాఁడ వొప్ప ద
వ్విధము చరాచరాత్మకము [2]విశ్వము నేను ధరింతు నాకు దు
ర్విధి [3]యొలయంగ నింతయును వేచెడి[4]పోవుట నీవ చూడుమా. 126

క. అన్నంబు నాయధీనం, బన్నము లేకున్న నిలుచునయ్య యొడళ్లీ
సన్నపుఁదలఁ పుడిగి సుసం, పన్న మగునుపాయ మొకటి పాటింపు తగన్. 127

తే. విను ముపాయపూర్వక మగువిపులయత్న, మరయ [5]సర్వార్థసాధక మఖిలజీవు
లందు వనిత లవధ్య[6]లయగుట నన్నుఁ, గావు నామాటవినికార్యగతికిఁ బొసఁగు.

క. [7]అనుడు జననాథుఁ డిట్లనుఁ, దనకై యొఱులకయి బహువిధప్రాణులఁ జం
పినఁ గీడగు నొకటిఁ దునిమి, మనుచు [8]టరుదె దేవి జీవమండలిఁ జెప్పుమా. 128

ఉ. కావున మత్ప్రయోజనము గైకొని చేయనినిన్నుఁ ద్రుంచి యే
నీ వివిధప్రజావితతి నెక్కటి దాల్చి [9]సమగ్రజీవన
శ్రీ వెలయించి నామహిమ సిద్ధముగా నఖిలంబునందు సం
భావన [10]మొందఁ జేసెద నభంగుర మిప్పని సాగరాంబరా. 130

వ. నీవు సర్వార్థసమర్థ వగుట యెఱుంగనే నన్ను నిట్లు గారింపం దలంచి యిమ్మెయికి మేకొనవు గాక యది యట్లుండె నా[11]కోర్కియు సిద్ధించునట్లు గావించి మదీయ దుహితవై యెల్లలోకంబులం బ్రఖ్యాతి గలిగించుకొని బ్రతుకు మిట్లు చేసెద వేని నిన్ను గుఱిచి కైకొనినయీరౌద్రసాయకం బుపసంహరించెద ననిన నద్దేవి యొక్కింత చింతించి యతని నాలోకించి. 131

1. యే యకట ధన్యత. 2. వేడుక. 3. యొనయంగ. 4. పోవఁడె నీవు. 5. సకలార్థ. 6. లట్లగుట. 7. అనుఁడుజననాయకుండను. 8. టురదా. 9. సమస్త. 10. నొంద. 11. కోర్కి.

క. గోరూప నైననా కిం, పారఁగఁ గ్రేపుల ఘటించి యయ్యైవస్తు
క్షీరములు పిదికికొనుటకుఁ, గోరి పసుపు వివిధభూతకోట్లను వరుసన్. 132

వ. అట్లయిన నెల్లవారికి వలయువాని నెల్ల నోలినొసంగ నోపుదు నిది నీకుఁ బరమోపాయంబు మఱియొక్కటి గలదు నిమ్నోన్నతభాగంబులవలన సమంబు గాకున్న నాయాకారంబు చక్కనగునట్లుగాఁ జూడు మనిన నట్లకాక యని వైన్యుండు కార్ముకకోటిం గొని [1]శిలలు ప్రోవుసేసి శిలోచ్చయంబులు గావించి యెల్లచోట్లు సవరయై యుండ నొనర్చి నగరగ్రామాదులు రచియింపం బనిచెఁ దొల్లి నివాసంబులు సస్యంబులు గోరక్షణవాణిజ్యంబు లనునవి లేవు కేవల వనసంచరణంబునఁ గందమూలఫలంబులు భరంపడి ఘటియించి యుపయోగింతురు పృథు మహీపాలుపాలనంబు మొదలుగా సమస్తవస్తుసిద్ధి గలిగె నని విందు మవ్విధంబున ననన్యసామాన్యసమాచరణధుర్యుం డయిన యప్పురుషవర్యుండు.

సీ. [2]స్వాయంభువుం డనఁ జనుమనుప్రవరుని వత్సంబుగాఁ జేసి వఱలు తనదు
హస్తంబు పాత్రమై యతిశయిల్లఁగ మహీధేనువుఁ బిదికి ధాత్రీజనులకు
సకలసస్యములును సర్వయుగంబుల వృథగాక ఫలియించువిధముగాఁగ
నొనరింప లోకు లభ్యుదయసమేతులై వర్తిల్లి రతఁ డెల్లవలనఁ గలుగు
తే. భువనవాసులఁ బిలిచి మీరవికలముగ, వలయునవి వేఱువేఱ మీవలను మెఱయ
నిర్ధరాదోగ్ధ్రిఁ గ్రేపులనెలమిఁ జేసి, [3]పిదికికొనుఁ డని పనిచె [4]సమ్మదము మిగుల.

వ. వారు నతనియత్నంబు గొనియాడి యట్లు సేసి [5]రందు. 135

క. సోముఁడు వత్సముగా సు, త్రామగురుఁడు [6]దోహకుఁడుగఁ దగ నఖిలచ్ఛం
దోమయపాత్రం బితికి ర, నామయులగుమునులు బ్రహ్మ మను దుగ్ధంబున్. 136

క. సురలు గొనిరి కాంచన వి, స్ఫురదజ[7]పాత్రమున బలరిపునివత్సముగా
మరిగించి సవిత దోగ్ధగ, నరుదగు[8]తేజంబు దుగ్ధమై సిద్ధింపన్. 137

క. పితృకోటి [9]పిదికె వైవ, స్వతకాలురు గ్రేపుఁ బిదుకువాఁడును గా రా
జతపాత్రంబున దుగ్ధం, [10]బతులాస్పదమై యెలర్ప నవనీసురభిన్. 138

క. ఆయసపాత్రంబున ఘన, మాయాదుగ్ధంబు గొని రమర్త్యవిరోధుల్
పాయక విరోచనుఁడు గ్రే, పై యొప్ప [11]ద్విమూర్ధుఁ డనుసురారి పిదుకఁగన్.

క. వసురుచి పిదుకఁగఁ బౌత్రము, బిసరుహముగఁ జిత్రరథుఁడు పెయ్యగఁ గొని రిం
పెసఁగ[12]ఁ గాన క్షీరం, బసమున గంధర్వవరులు నమరాంగనలున్. 140

1. శిలలు. 2. స్వారోచిషుం డన. 3. పితికి. 4. సమ్మతము. 5. రంత. 6. దోహనుఁడు. 7. పాత్రికఁ. 8. మార్జంబు. 9. చిదికి, కిడిరి. 10. బతులన్వధరయై. 11. విమూర్ధయను. 12. సుగంధ.

క. తార పిదికికొనఁ జాలి కు, బేరుని వత్సముగ విడిచి పిదికిరి యతులుల్
ధీరమతు లామ[1]పాత్రను,దారాంతర్ధానశక్తి తగుదుగ్ధముగన్. 141

తే. రజతనాభుఁడు దోగ్ధగా రాక్షసులు పి, శాచములు నృకపాలభాజనములందుఁ
గనిరి నరరుధిరాఖ్యదుగ్ధము సుమాలి, వత్సమై పెంపొనర్పఁగ వసుధఁ బిదికి.

క. వాసుకి పిదికెడువాఁడుగ, భాసితఫణ[2]పాత్ర గరళబహుదుగ్ధము లు
ల్లాసమునఁ గ్రేపు తక్షకుఁ, డై సమకొనఁ గొనిరి దారుణాద్భుతభుజగుల్. 143

క. [3]మేరుగిరి దోగ్ధగా నీ, హారనగముఁ గ్రేపుఁ జేసి యద్రులు పిదికెన్
భూరిశిలాపాత్రికలన్, గోరిమహౌషధులు, రత్నకోటులు నుర్విన్. 144

క. వృక్షములు లతలు గొనియెన్, బ్లక్షము గ్రేపుగఁ బలాశపాత్రికలన్ [4]బాల్
ప్రక్షతిఁ బునఃప్రరోహత, నక్షత పాలంబు దోగ్ధయై తిలకింపన్. 145

వ. ఇవ్విధంబున సకలచరాచరభూతంబులు నాత్మీయ వాంఛితంబులు శాశ్వతంబులుగాఁ బడసి పరమానందంబునం బొదలం ద్రైలోక్యకామదోహినియై ధాత్రియు విధాత్రియుఁ బావనియు ననుభవ్య[5]నామంబులం బ్రాజ్ఞవర్ణితయై వసుంధరాదేవి పృథునిశాసనంబున నిలిచి యతనికిఁ బుత్త్రియై[6]పృథ్వి యనుపేరం బరగి మధుకైటభమేదోమేదురయగుటఁ దొల్లియు మేదినియను పేరి మెయ్యుఁగనియెనంత [7]ననేకసస్యశోభితయు ననేక[8]వసురత్నాకరయు నపరిమితపురగ్రామప్రతిష్ఠానగరిష్ఠయు నవిరతప్రాణిసముదయసంకీర్ణయునై యతిశయిల్లె నీదృశప్రభావ నిత్యధన్యుం డైన యవ్వైన్యుండు రాజన్యులకు నాద్యుం డనవద్యుండయి వెలింగి భువనపూజ్యుం డయి [9]సామ్రాజ్యంబునఁ బ్రాజ్యసుఖం బనుభవించె నని చెప్పి వైశంపాయనుండు. 146

సీ. సకలభూతములకు సంభావనీయుఁడు పృథుచక్రవర్తి ప్రస్ఫీతకీర్తి
వేదవేదాంగపవిత్రవర్తను [10]లైనవిప్రులకును నీతివిక్రమములఁ
బరగురాజులకును బశుపాలనాకృషివాణిజ్యరతు లైన వైశ్యులకును
ద్రైవర్ణికార్చనాతత్పరు లగుశూద్రులకు నమస్కార్యుం డలంఘ్యగుణుఁడు

తే. వృత్తిదాత యాదిమధర్మవృద్ధికరుఁడు, శూరవర్యుండు గావున శూరులకును
మాన్యుఁడాజిఁజనుచోటవైన్యుఁదలఁచి, భటులు గెలుతురనాయాసభంగిఁబగఱ.

క. ఈపృథుచరితము జనులకుఁ, బాపహరము భూరిపుణ్యఫలదము నిత్య
శ్రీపుత్రపౌత్రవర్ధన, మోపి పఠించినను వినిన నొసఁగున్ ముక్తిన్. 148

వైశంపాయనుఁడు జనమేజయునకు మన్వంతరంబుల నెఱిఁగించుట.

వ. అనిన విని జనమేజయుండు మన్వంతరంబులతెఱం గడిగిన వైశంపాయనుండి ట్లనియె. 149

---

1. పాత్రి. 2. పాతి. 3. మేరువు దోగ్ధయుంగా. 4. బల్. 5. సంజ్ఞలం బ్రాగ్వర్ణితయై. 6. పృథ్వియనన్. 7. నస్యశోభిని 8. సురత్నాలంకృతయు. 9. పూజ్యంబగు సామ్రాజ్యసుఖా. 10. లగు.

క. తోయజసంభవు పౌత్రా, త్కాయసముద్భవుఁ డు[1]దాత్తదానాఢ్యతముం
డాయతమతి యాదిమనువు, స్వాయంభువుఁ డపరపద్మసంభవుఁ డనఘా. 150

వ. అతని కాలంబున [2]యామాభిధానులు పన్నిద్దఱు దేవతలై రి పరమేష్ఠి తేజం బపర మూర్తియై యింద్రత్వంబు నొందె మరీచి యత్రి యంగిరసుండు పులస్త్యుండు పులహుండు క్రతువు వసిష్ఠుండు సప్తమునిపదంబు గైకొనిరి ప్రియవ్రతోత్తాన పాదులు మనుపుత్త్రులు ధాత్రీపరిపాలనంబునకు [3]నభిషేకంబు భజించి రందుఁ బ్రియవ్రతునకు నాగ్నీధ్రుండగ్నిబాహుండు మేధుండు మేధాతిథి వసువు జ్యోతిష్మంతుండు ద్యుతిమంతుండు హవ్యుండు[4]వపుష్మతుండు సవనుండు ననం బదుండ్రు గొడుకులు గలిగిరి వారిలో నగ్ని[5]బాహుమేధహవ్యు లనువారు మువ్వురు విరక్తులయి పోవం దక్కినయేడ్వురు నేడుదీవులకు నేలికలై వేర్వేఱ పెక్కండ్రఁ దనయుల నుత్పాదించి వర్షాధిపతులం గావించిరి. 151

క. స్వారోచిషుఁ డనుపేర ను, దారుండు ద్వితీయమనువు తద్దయు వెలసెన్
దా రాజికదుషితు లనం, గా రెండుగణంబు లైరి క్రతుభుజులు నృపా. 152

వ. [6]విపశ్చిన్నామధేయుండు యజ్ఞశతసుకృతంబున నింద్రుం డయ్యె [7]నూర్జుండు ప్రాణుండు దత్తుం డగ్ని ఋషభుండు చ్యవనుండు బృహస్పతి యనువారు సప్తమునిత్వంబు నంగీకరించిరి [8]జైత్రుండు గింపురుషుం డాదిగా మనుపుత్త్రులు రాజకులంబులం గలిగించిరి. 153

సీ. విను ముత్తముండు నా వెలసె మూఁడవమను వతని కాలంబున నమరగణము
లైరి సుధామసత్యశివప్రతర్దనవశవర్తు లన నొప్పి వాసవత్వ
మొందెను శాంతినా నొకపుణ్యకృత్తు సుతేజుఁడు మొదలైనదీప్తతేజు
లనఘు లేడ్వురు వసిష్ఠాత్మజన్ములు మును లై రోలి నిషుఁ డూర్జుఁ డనఁగ వత్సు
తే. డనఁగ మధుమాధవులు నాఁగ[9]ననఁగ సహుఁడు
[10]శుచి యనఁగ శుక్రుఁ డన నభస్యుఁడు నభుఁ డన
మనుతనూభవదశకంబు మహి [11]భరించెఁ
దత్తదన్వయములుఁ బెక్కు ధనరె నందు. 154

తే. తామసుఁడునాఁ [12]జతుర్థుఁ డతామసాత్ముఁ,డధికుఁడై యొప్పెమనువుదదంతరమున
దేవతలు [13]హరసత్యసుధీసుధాదు, లనఁగ నాలుగుగణములై యమరి రోలి. 155

1. ధాత కాలా. 2. యమా. 3. నభిషిక్తులై. 4. సంస్కృతగ్రంథములో "వపుష్మంతుఁడు" లేదు. పుత్త్రుండు ఉన్నది. వ్రాతప్రతిలో "హవ్యుండు" లేదు. పుత్త్రుండు ఉన్నది. 5. బాహుమేధ నత్రు. 6. మహిత్షి. 7. నూస్తంబుఁడు. 8. హరిద్రుండు. 9. నటశుచియన. 10. శుక్రుఁడన నహుండన నభస్యుఁడు, నుహుఁ డనఁగ. 11. ధరించె. 12. ఆతుర్థుఁడు తామసాత్ము. 13. హరిసత్య.

వ. శిబి యనుమహాభాగుండు వేల్పులం బాలించె కావ్యుండును బృథుండు నగ్నియు
జహ్నుండును ధాతయుఁ [1]కపివంతుండును బవనుండును ననువారు సప్తర్షి భావం
బులు వడసిరి జ్యోతియుఁ దపస్యుండును సుతపుండును దపోమూలుండును దపో
ధనుండును దపోరతియుఁ దన్వియు ధన్వియు నకల్మాషుండును బరంతపుండును
ననుమనుతనూజులు పదుగురు రాజులైరి పంచమమనువయిన రైవతుకాలంబునం
గలవారల వినిపించెద. 156

తే. విను సుమేధసు లనఁగ భూతనయులనఁగ, వరుసతోడ వైకుంఠులు స్వామిభోగు
లనఁగనాలుగుగణములై రమరులమర, విభుతఁగాంచె.బుణ్యాత్ముఁడు విభుఁ డనంగ.

వ. వేదబాహుండు వినిద్రుండు వేదశిరుండు హిరణ్యరోముండు సత్యనేత్రుండు
పర్జన్యుం డూర్ధ్వబాహుండు ననువారు సప్తమును లైరి ధృతిమంతుం డవ్య
యుండు తత్త్వదర్శి [2]నిరుత్సుకుం డరణ్యుండు ప్రకాశుండు నిర్మోహుండు [3]సత్య
వాక్కు కృతియు రైవతుండు ననుమనుప్రభువులు భూప్రభువు లైరి చాక్షుషుం
డాఱవ మనువు తత్కాలంబున. 158

తే. ఆద్యులు [4]ప్రభూతఋభువులునాఁ బృథుజ్ఞు, లనఁగ లేఖులునా వేల్పులై దుగణము
లైరి వేల్పుల నేలె శతాధ్వరక్రి, యాజితత్త్రిలోకుండు మనోజవుండు. 159

వ. అంగిరసుపుత్రు లేద్వురు మునులై వెలసిరి మనునందను లైనయూరుప్రభృతు
లుర్వి పాలించిరి సప్తమం బగువైవస్వతమన్వంతరం బిప్పుడు వర్తిల్లెడు నిందు
వసురుద్రాదిత్యమరుద్విశ్వే[5]సాధ్యాశ్విను లనుననిమిషు లెనిమిదిగణంబు [6]లూ
ర్జస్వి యనువాఁడు దేవేంద్రుండు కశ్యపాత్రివిశ్వామిత్రగౌతమభరద్వాజ జమ
దగ్నివసిష్ఠులు సప్తమునులు మనుజాతు లయినయిక్ష్వాకుప్రముఖులు మహీ[7]శు
లయి నిజవంశంబులు ధరణిం బ్రతిష్ఠించిరి. 160

క. మనువులు నమరులు నింద్రుఁడు, మునులును నిజవిహితకాలములతుదిఁదొలఁగం
జనఁగా నన్యులు వెసఁ గై, కొని నిలుతురు తత్పదము లకుంఠితగరిమన్. 161

వైశంపాయనుఁడు జనమేజయునకు ననాగత మన్వంతరములఁ జెప్పుట

క. వీరెల్లను దమతమయధి, కారంబులు నిర్వహించి కడపట నాత్మో
త్తారక మగు బోధము గని, చేరుదు రఖిలాత్ము మగుడఁ జెందరు భవమున్. 162

వ. అతీతవర్తమానమన్వంతరంబు లెఱింగించితి నిటమీఁద సూర్యసుతుండు సావర్ణుం
డష్టమమనుత్వంబు నొందెడు నతనికాలంబున సుతపస్సునాభముఖ్యు లన నమ
ర్త్యులు మూఁడుగణంబు లయ్యెదరు బలిదైత్యుండు దివిజాధిపత్యంబుఁ బడయుఁ
బరశురాముండు పారాశర్యుండు ఋశ్యశృంగుండు గృపాచార్యుం డశ్వత్థాము

1. కపిధానుండు; కపీవరుండు. 2. నియుక్తుం. 3. సత్యవంతుండు కవియు. 4. ప్రసూత ఋభులనిజాఁ. 5. దేవసాధ్యా. 6. లోజస్వి. 7. పతులయి 8. గతిదిన్.

[1]దీప్తిమంతుండు గాలవుండు నీయేడ్వురు మహాముని[2]పదంబున వెలుంగుదురు
పరీవానుండన తురీవానుండు సమ్మతుండు ధృతిమంతుండు పసుండు వరిష్ణుండు
నాథుండు ధృష్ణుండు వాసుండు సుసరీషుండు వృష్ణి సుమతి మొదలుగా మనుత
నయులు మనుజవిభులుగాఁ గలరు మఱియు దక్షదౌహిత్రులు నలువురు మేరు
సవర్ణులయి సావర్ణ్యులనం బరగి యాకనకశైలంబుతటంబునఁ దపోనిష్ఠనున్నవారు
రుచిప్రజాపతిపుత్రుండు రౌచ్యుండును భూతిసంభవుండు భౌత్యుండునుగా
ననాగతమనువు [3]లేడ్వురు వీరలయందును సురలు సురేంద్రులు మునులును
మనూద్భవులును వేఱువేఱ పురాణంబులం బరికీర్తితు లయి యుండుదురు. 163

సీ. యుగచతుష్టయమును నొక్కటియై యేకసప్తతివారముల్ [4]సనియె నేని
మన్వంతరం బగు మన్వంతరంబున సలిలప్లవం బగు సలిలసంప్ల
వావసానము సృష్టి యంచితచరిత యీసరణిని యుగసహస్రంబు దెగిన
నబ్జాసనునకు దినాత్యయం బొదవు నత్తఱి సర్వభూతబృందములు నొక్క

తే. పెట్ట యాదిత్యరశ్ములు పెల్చఁబ్రేలు, నట్టిపెడిదంబునకు నోర్వ కమరవరులు
మునులు నజుఁడు మున్నుగ మహామూర్తివిష్ణు,నుదరదేశంబుసొత్తురు బ్రదుకుగోరి.

వ. ఇప్పుడు చెప్పంబడ్డయీప్రపంచవర్తనం బంతయుం గల్పంబులీలలం దెల్లను సాధా
రణం బైనవిధంబు నీ వడిగినయఖిలమన్వంతరంబులు సంక్షేపరూపంబున నీ కెఱిం
గించితి నేతదీయ [5]విస్తరకథనంబు వర్షశతంబునకైన నశక్యవిధానం బనియుపన్య
సించి వైశంపాయనుం డన్నరనాయకుతో మఱియు నిట్లనియె. 165

తరువోజ. ఈవిశ్వమునుసృజియింపంగఁగర్తయీశ్వరుఁడాద్యుఁడహేతుఁడక్షరుఁడు
గోవిందుఁడనఘుయేకులమునందాత్మగోరియుద్భవమయ్యెఁగువలయంబలర
నావృష్ణిభూవరాన్వయము గీర్తించునట్టియీకథనంబునం దేను చెప్ప
వైవస్వతుండిప్పువర్తిల్లుమనువువంశంబు వినుము భవ్యముగాన తొలుత. 166

క. తనహృదయేశ్వరుఁ గశ్యపు, ననుకూలప్రీతిఁ గొలిచి యదితి యతనిపా
వనతేజంబునఁ దాల్చె, దనయుం జూలుగ సహస్రధాము మహాత్మున్. 167

క. ఆచందంబున నుండి వి, రోచనుఁ డాత్మీయతిగ్మ రుచిఁ దల్లితనూ
గోచరకాంతి యఖిలమును, వే చెన్నఱఁ జేసెఁ జిత్రవిభవస్ఫూర్తిన్. 168

వ. కశ్యపసంయమియు నయ్యతివం జూచి యవ్విధం బెఱుంగమిం జేసి నీయుదరంబు
లోనిగర్భాండంబ మృతంబు గావలె నని పలికె నది గారణంబుగా మార్తాండుం
డనుపేర నుదయించి యాదిత్యుం డత్యుగ్రతేజంబున జగత్త్రయంబునకు నధికసం
తాపంబు సేయుచుండె నతనికిఁ ద్వష్టకూఁతురు సంజ్ఞాదేవి దేవియై యసాధా
రణం బగుసౌకుమార్యంబు గలయది గావున. 169

---

1. దీప్త. 2. పదవి. 3. లార్వురు. 4. ననినయేని, ననినమనువు. నంతరం బయిదుమన్వంతరాంతర మున. 5. కథావిస్తరంబు.

చ. [1]గనఁగనయెల్ల ప్రొద్దు గనిక్రాలెదు వేఁడిమిఁ బేర్చు భర్తమే
నెనయను డగ్గఱన్ సయిఁప కెంతయు భీతి నొదుంగుచున్ లస
ద్వనరుహాపత్త్రలోచన యవంధ్యచరిత్రమునన్ దదాత్మకిం
పు నెఱయఁ జేయుచుం గనియెఁ బుత్త్రుల నిద్దఱ నొక్కకన్నియన్. 170

వ. వైవస్వతమనువును యముండును యమునయు నన నిట్లు ముగ్వురం గనియు నవ్వా
రాంగి యోర్వలేక నిజచ్ఛాయం జేసి ఛాయయను [2]దానిం బుట్టించిన నది తనయె
దుర నిలిచి పని యేమి యని కేలు మొగిచి యున్నయన్నాతిం జూచి. 171

క. [3]తాను బతివేఁడిమిఁ బరిమ్లానాకృతియై కడుం దలంకెడు తెఱఁగ
మ్మానవతికి నెంతయు సమ్మానన నెఱిఁగించి యనియె మంజులరీతిన్. 172

ఆ. పుట్టినింటి కేను వోయి యొక్కించుక, యూఱడిల్లి వత్తు నువిద నీవు
వింతతనము లేక విభునకుఁ బ్రియము నా, మాఱుగా నొనర్చి మనుము నెమ్మి.

క. [4]మఱచి యయిన నాయిత్తెఱఁ, గెఱిఁగింపకు పతికి బిడ్డ లీముగ్వురకున్
నెఱసినగారా మేమియుఁ, గొఱఁతవడక యుండ [5]నడపి కొఱలుము శుభమున్.

క. నావుడు నది యాయమతో, దేవీ తలపట్టియీడ్చి తిట్టుకొలఁది రో
షావేశముఁ బతి యొందిన, నేవిధమున నిన్నుఁ జెప్ప నిది నిజ మనినన్. 175

వ. సంప్రీతమానసయై సంజ్ఞాదేవి తండ్రిపాలికిం జని తనవచ్చినకారణం బెఱింగించి
సిగ్గునం దలవాంచి యున్న విశ్వకర్మ యక్కొమ్మం గినిసి బుజ్జవంబులుఁ దర్జనం
బులుఁ బెరయ నశ్రుకణకరాళకపోలం బగు తదాననం బాలోకించి. 176

క. ఎంతయుఁ గ్రూరుం డయినను, శాంతుఁ డయినఁ బతియ చువ్వె సతికారయ న
త్యంతపుబంధువు [6]తదతి, క్రాంతి దలఁచు కాంత యొందుఁ గను నే శుభముల్. 177

తే. పొమ్ము నీప్రియు[7]పాలికి నమ్మ తగదు, విడువు తలఁ కని కన్నీరు దుడిచి కూర్మిఁ
[8]గౌఁగిలించి వీడ్కొలిపినఁ గ్రమ్మఱంగఁ, బోక బెగ [9]డగ్గలింప నప్పూవుఁబోఁడి.

వ. నిజాకారంబు మఱుఁగు[10]పఱుపం దురంగిరూపంబు దాల్చి యొక్కవివిక్తప్రదే
శంబునం బతిసమాగమంబుఁ గోరుచుఁ దదీయధ్యానపరవశయై యుండె నంత
నక్కడ. 179

ఛాయాదేవియందు సావర్ణశనైశ్చరతపతులు పుట్టిన ప్రకారము.

సీ. ఛాయ సంజ్ఞాదేవిచందంబునన సూర్యునందు శుశ్రూషణం బాచరించు
చుండంగ నతఁడును నొం డెఱుంగక యనురాగవిహారైక రతిదలిర్ప
సావర్ణుఁడును శనైశ్చరుఁడును దపతినా బరగు కన్యయు జనించిరి క్రమమున
నయ్యింతి దనపాపలందు మిక్కిలి కూర్మి వెలయ సంజ్ఞాదేవిబిడ్డ లయిన

1. కనఁగవ నెల్లప్రొద్దు గొని కాలెదు (పూ. ము.) 2. భామం. 3. తనపతివేఁడిమికిఁ బరి.
4. మఱచైనను. 5. వెరవికొఱలుము. 6. దనవిశ్రాంతి దలఁచు కాంతయందు గను నె సుఖంబుల్.
7. పాలికోయమ్మ. 8. కౌఁగలించి. 9. డంగలింప. 10. పడం.

తే. ముప్పురను గేరడము సేయ నవ్విధంబు, [1]సైపలేక యొకప్పుడు శమనుఁ డలిగి
చరణ మమ్మాఱుదల్లిపైఁ జాఁచెఁ దన్న, దాని కాయమ [2]కోప సంతాప [3]మెసఁగ.

క. జనని యనక యిల్లింతయు, నను[4]లంకించి తటుగావునం బదము మహిం
దునిసిపడుఁ గాత యని పెల్చ,న శపియించుటయు వెఱచి జముఁ డాతురుఁడై.

వ. తండ్రిపాలి కరిగి ప్రణతి యొనర్చి తనయపచారంబు తల్లి కోపించి యిచ్చిన
శాపంబును నెఱింగించి. 182

ఉ. ఎందఱు గల్గినం బ్రజల [5]కేకవిధం బగులాలనంబు సే
యం దగరే సవిత్రులు మదంబ [6]మముం ముగురం సహింప దే
చందమొ పిన్నవారలకుఁ జాలఁగఁ బక్షముసేయ దీనికిం
డెందములోనఁ దాలిమి ఘటింపక యే నిటు తప్పుసేసితిన్. 183

తే. [7]బాల్యమున నైన నజ్ఞానభంగి నైన, [8]నైన దీని సహించి శాపానుభవము
దగులకుండంగఁ జేయవే జగదధీశ, యనినఁ గరుణించి కమలాప్తుఁ డతనితోడ.

క. వినయజ్ఞుఁడు ధార్మికుఁ డితఁ, డనఁ బరగిన నీవు నిట్టు లగుట యరిది యి
ప్పనికి నిమిత్తం [9]బేమో, యనఘా కలుగంగఁ [10]జాలు నాత్మఁ దలంపన్. 185

వ. అది యట్లుండె మాతృవాక్యం బమోఘంబు గావున నొక్కతెఱంగు సేసెదం
గ్రిములు భవచ్చరణమాంసంబు ధరణిపయిం దొరఁగింపఁ గలయవి యంతశాప
ఫలం బనుభూతం[11]బ యగు నని పలికి ఛాయాదేవిం జూచి నీవు సర్వసంతతి
యందును సదృశవాత్సల్యవు గావు, గామికిఁ గతం బేమి యని యడిగిన నది
యేమే నుత్తరం బీఁబోయినం గనలి యినుండు నిజంబు చెప్పుము చెప్పకున్న
నిన్నుఁ గఠోరశాపానలంబుపాల్పఱుతు ననుటయు. 186

ఆ. సంజ్ఞ సనిన తెఱఁగు సకలంబుఁ జెప్పె న, త్తెఱవ యతఁడు రోషదీప్యమానుఁ
డగుచు విశ్వ[12]కర్మ నావాసమునకు నేఁగుటయు నమ్మహాత్ముకోప మెఱిఁగి. 187

వ. అతఁడుం దనకూఁతురు మగిడి మగనిపాలికిం బోవమియు నాత్మదృష్టిం [13]దెలిసి
యల్లునిం బ్రియవినయసంభావనంబుల ననునయించి ప్రసన్నుం గావించి. 188

శా. నీతేజం బతితీవ్రమై పరగుట న్నిక్కంబు సైరింపలే
కాతంకంబునఁ బొంది సంజ్ఞ భవదీయాకార[14]శాంతత్వముల్
జేతోవృత్తమునందుఁ గోరుచుఁ దపశ్శీలాత్మయై యున్న దీ
వాతన్వీం జరితార్థఁజేయఁ దగదే యాత్మానుకూలంబుగన్. 189

మ. భవదీయం బగుదివ్యయోగము గణింపం శక్యమే యద్భుతం
బవికారం బది చెప్పనేల నను నీవాజ్ఞాపనం బిప్డసే

1. నాఁపఁగాలేక శమనుఁ డొకప్పు. 2. రోష. 3. మదర. 4. భంగించి. 5. కేకప్రియంబున బుజ్జవంబు. 6. యం మమ్మును ముగ్గురన్న చే; య మమ్మువురం. 7. బాల్యమందును. 8. నయ్యె నిది దీనిస్సైఁచి. 9. బేమే ననఘా, 10. బోలు. 11. బగు, 12. కర్మయా. 13, గని. 14. కాంత,

యువిధం బించుక గగ్గలై నేని విను చిత్రోపాయసంధాయినై
భువనాభ్యర్చిత యొండుచంద [1]ముల నొప్పుల్ దెత్తు నీమూర్తికిన్. 190

చ. అనుటయు నవ్విధంబునకు నంబుజబాంధవుఁ డియ్యకొన్న నా
తనిపటుదీప్తిమండలి ముదంబున నొగ్గమునం దమర్చి వే
తునియఁగ [2]ద్రచ్చెఁ జిత్రకృతిధుర్యుఁ డవార్యజగత్ప్రమోదవ
ర్ధనుఁడు సురేంద్రవర్ధకి యుదంచితతేజము ద్రెస్సి రాలఁగన్. 191

వ. ఇట్లు కిరణంబు లెల్ల [3]సుఱవి డుల్లి విన్ననైనం [4]గాంతిమాత్రదేహుండై పద్మినీకాంతుండు నిజకాంత యున్నరూపంబు యోగదర్శనంబునం గని తానునుం దురంగమూర్తియై యచ్చటి కరిగి కదియుటయు [5]నమ్మగువ యన్యపురుషుం డనుతలంపునఁ బిఱుఁదు డాఁచి యడఁగుటయు నిరువురనాసాపుటంబులు మోచిన [6]నాసత్యులు పుట్టిరి తదనంతరంబ. 192

శా. ఆరూపంబటువాసి నైజతను వింపారంగఁ దాల్పంగ [7]జే
తోరాగంబున [8]నవ్వెలంది నిజనాథుఁ గాంచి తా నీశుభా
కారం బేర్పడ నిల్చె నయ్యిరువురుం గామోపభోగక్రియా
ధౌరేయం బగునుజ్జ్వలోత్సవమునన్ ధన్యాత్ములై రెంతయున్. 193

వ. ఆవివస్వంతుండు తనయగ్రపుత్త్రుం డగువైవస్వతునకు సప్తమమన్వంతరాధిపత్యం బొసంగె యముండు నిజధర్మవివర్ధనంబున ధర్మరా జనువిఖ్యాతియు మహత్త్వంబునుం గనియె సావర్ణుం డిటమీఁద నష్టమమనుభావంబు భజియింపం గలవాఁడై మేరుశిఖరంబునందు గరిష్ఠ యగుతపోనిష్ఠ [9]వసియించి యుండె శనైశ్చరుండును గ్రహపదవిం బ్రదీప్తుండై నిలిచె [10]యమున మహానదియై లోకపావనస్ఫూర్తిం బ్రవర్తిల్లెఁ దపతి సంవరణుం డనురాజునకు రమణియై భారతవంశ[11]ప్రదీపకరం బగునపత్యంబులుం బడసె నాసత్యు లాశ్వినేయు లన నమరులకు వైద్యులై యనవద్యవిద్యాగరిమంబునం బెంపొందిరి బృందారకశిల్పియు ననల్పం బగుతపనతేజోరజఃపుంజంబున నజునకు నప్రతిమానవిమానంబును దానవధ్వంసికిఁ బ్రశంసనీయవిక్రమం బగుచక్రంబును ఫాలలోచనునకు నాభీలం బగుశూలంబును రచియించె నిట్లు కీర్తితంబైన. 194

క. ఈదేవజన్మకథ న,త్యాదరమున వినినఁ బ్రీతులై చదివిన స
మ్మోదంబున వ్రాసిన ల,క్ష్మీదీర్ఘాయువులు సుతసమృద్ధియుఁ గలుగున్. 195

క. అని జనమేజయవిభునకు, మునివైశంపాయనుండు మును పరిపాటిన్
వినుపించినకథ యంతయు, ననుపమచారిత్ర యన్నమాంబాపుత్త్రా. 196

1. మిల నొప్పం జేయ. 2. ద్రచ్చె. 3. సుఱవు. 4. శాంతి. 5. నది. 6. దస్రులం. 7. జేతో. 8. భొందికాంతయు నిజేశుఁ. 9. నధిష్ఠించి. 10. నయ్యమున. 11. ప్రదీపకులగు.

